

శ్రీహరీంద్రనాథ ఛటోపాధ్యాయ

# ఇంద్ర ధనుస్సు

## (కథలు)

కవి

శ్రీ హరీంద్రనాథ ఛటోపాధ్యాయ



అనువాదకులు

శ్రీ దాసు త్రివిక్రమరావు పంతులు
యల్.యల్. బి. ఆనర్సు (లండన్). బార్-ఎట్-లా.




ప్రకాశకులు

పి. ఆర్. అండ్ సన్సు, విజయవాడ-2.

# కొన్ని మాటలు

పరిణామ శీలములైన లోక పరిస్థితులను యథాతథముగాఁ జూపఁగల నానా వర్ణ దర్శినివలె నీ చిన్నిపొత్త మొక చిన్ని కథల సంపుటి. జంతువులు, పక్షులు, యోగులు, సంస్కర్తలు, మనుష్యులు, భగవంతుఁడు నను విభిన్న మూర్తుల కథ లిందున్నవి. ఒక నక్క యొక్క జిత్తులు, శ్యామసోదరుని సందర్శించిన యొక పసివాని యచంచల విశ్వాసము, రాజునుదరమం దుండియు గాన మాఁగని సంగీత పక్షి పాఠకుల పరిచయము సంపాదించును.

స్థూలదృష్టికిఁ దోఁచు నర్థమే కాక యంతర్వాహినిగా ననేకార్థములు నిశితదృష్టికి స్ఫురింపఁదగిన ట్లిం దీ చిన్నికథలు పొందు పఱచితిని. నేఁటికిని దేశజ్ఞులురై, చిరకాల దాస్య పీడచేఁ గ్రుంగిపోక సహజవిజ్ఞానము రక్షించుకొను మనభారతీయుల సద్గుణ గణములను గూడఁ జిత్రింప యత్నించితిని.

అరేబియా, హిందూదేశ చరిత్రలే యీ కథల కాధారములు.

బాలురకు భావనాబలము పెంపొందించునట్లును, నధిక ప్రయాసముతో నిమిత్తము లేకుండ, నవలీలగాఁ గవి హృదయము గ్రహింపఁ గలుగునట్లును, నాకర్షకము లగునట్లును గథలను దీర్చి దిద్దఁ బ్రయత్నించితిని.

విశాల విశ్వమందలి యంతరాంతరములకుఁ బ్రయాణించి, కొలఁదికాలములోనే యెల్లెడ భావనాబీజములు వెదఁజల్లి యందందవి యంకురించి, కుసుమించి, ఫలింపఁజేయఁ గలదని విశ్వసించి యీ చిన్ని కబ్బము నిప్పుడు బాలుర కర కమలముల కందించుచున్నాను. బాలమిత్రమా! నానావర్ణ దర్శినియగు నీ కావ్య మిప్పుడు నీ చేతిలో నున్నది. దానిని సునిశితముగాఁ బరిశీలింపుము. అది భిన్న భిన్న రుచులతో నిన్నలరింపఁగలదు.

—హరీంద్రనాథ ఛటోపాధ్యాయ

# విజ్ఞప్తి

వర్తమాన రచయితలలో మహోన్నత శ్రేణికిఁ జెందిన శ్రీ హరీంద్రనాథ ఛటోపాధ్యాయుఁడు ఆంగ్లమున రచించిన 'KALEI-DOSCOPE' అను చిన్ని కథల సంపుటి కిది యనువాదము. తెలుఁగున నిది 'ఇంద్రధనుస్సు' అను పేరఁ గూర్పఁబడినది. జగమెఱిఁగిన బ్రాహ్మణునకు జందె మేల ? ఛటోపాధ్యాయుఁడే యీ గ్రంథ ప్రయోజనము గుఱించి తన పీఠికలో వివరించి యుండఁగా ననువాదకుని కా శ్రమ దేనికి ?

ఇఁక ననువాద విధానము గుఱించి మాత్రమే చెప్పవలెను. మూలము నతిశయించున ట్లనువదించుట యెట్టివారికైనను నసాధ్యమను కొందును. నాయూహ సరియైనది కాక పోవచ్చును. ఏమైనను మనసులోని మాటఁ జెప్పుకొనుట కభ్యంతరము లేదుగదా ! చాలవఱకు మూలములోని భావములు చెదఱకుండ రాఁబట్టుటకుఁ బ్రయత్నము చేయఁబడినది. తెలుఁగు నుడికారమునకై యలఁతి స్వాతంత్ర్య మవలంబింపఁ బడినది. తెలుఁగు విద్యార్థుల కిది యుపయుక్తమగునట్లు కృషి చేసితిని.

సర్వవిధముల నుపవాచకములలో నిది క్రొత్త వెలుఁగులు వెలయించుటతో నొక ప్రత్యేకత నందుకొన్నది. ఇది యాంధ్ర విద్యార్థుల కుపయుక్తమగుటయే నాకుఁ గావలసినది.

—దాసు త్రివిక్రమరావు

# విషయసూచిక



అధ్యాయము | | పుట





# ముఖ్యోద్దేశములు

## 1. శకుంతవాణి

విధినిఁ దప్పించుకొనగలవారు లేరు: శకుంతవాణి నబద్ధమనిపింపఁ దలఁచి తండ్రి కుమారుని సముద్రమునఁ బడఁద్రోసెను. కాని యతని ప్రయత్నము విఫలమైనది. పక్షుల మాటలు ఫలించినవి. రాజైన కుమారుని యింటఁ దండ్రి భారవాహుఁడైనాఁడు.

## 2. పన్నా

విశ్వాసమే యీ యితివృత్తమునకుఁ బ్రధానాంశము. నమ్మిన వారికై కన్న కొమరుని బలివెట్టుటన్నది త్యాగశీలురకు ఘనకార్యము కాదు. ధర్మము జయించును. అధర్మము నశించును. దుష్టప్రవృత్తికిఁ బరిహారముగా వనవీరుఁడు మస్తక మర్పింపక తప్పలేదు.

## 3. ఆదర్శజీవి

ఒకయుత్తమ చిత్రకారుఁడు నిజహృదయ రక్తముతోనే చిత్రము లిఖించును. అనఁగా నతని హృదయమునే యందుఁ జిత్రించును. అతనికళ హృదయోద్భూతము. వినోదమునకుఁ గాక కృతార్థతకే యతఁడు చిత్రములు లిఖించును.

## 4. జంబుకాచార్యుఁడు

గుమాస్తాలను దయారు చేసికొనుటకై బ్రిటిషు సామ్రాజ్యము భారత దేశమున నేర్పఱచిన విద్యావిధాన మిందు సూచితము. పాఠశాలలోనే జీవితములు ముగించిన మకరశిశువుల గతియే యప్పటి బడి చదువులవారి గతి.

## 5. రాజా రామమోహనరాయలు

ఆ జీవితము దేశసేవకే యంకితము. స్వల్పజీవితములో నతఁడు చేసిన మహోత్తరసేవ ప్రదర్శించిన ధైర్యసాహసములు నాశ్చర్యజనకములు కాకపోవు.

## 6. ధ్రువశ్యామ సోదరులు

నమ్మిక మహాధనము. దేశకాలపరిస్థితులకు హేతువాదములకు నది యతీతమైనది. శిశుహృదయ నైర్మల్యమిం దభివర్ణితము. ఆ శిశువు భగవంతుని కాప్తుఁడై భవిష్యత్తునందును దదభిముఖముగనే ప్రయాణింపఁ గలఁడు.

## 7. సంగీతపక్షి

కొత్త వేషములకు వ్యామోహము తగదు. అవి భయావహములు. భగవత్ప్రసాదిత గానకళ యమూల్యము. దానికి నాశములేదు.

ప్రజాకంటకుఁడగు రాజు పదభ్రష్టుఁడగును అతడు క్రూరుఁడైనంతనే ప్రజలే యతని నణఁచివైతురు.

## 8. వాల్మీకి

మహాపురుష హృదయముకూడ రాగద్వేష బద్ధ మగుచుండును. ఒక్క దివ్యక్షణములోఁ బశ్చాత్తప్తత కలుగును. పుణ్యమార్గమునఁ బయన మారంభమగును. సంస్కరణమునకు, మహనీయతకు, దీనజనోద్ధరణ సామర్థ్యమునకు మత్తమ గురువును సేవించు టవసరము. విశ్వ సమర్చనీయుఁడైన మహాకవి వాల్మీకి మహర్షి చరిత్రమే యిందులకు నిదర్శనము. బందిపోటుదొంగయే పశ్చాత్తాపముచేఁ బాపవిముక్తుఁడై మహాత్ముఁడు కాఁగలిగెను. దివ్యకళయే తనలో నుండుటవలన మానవుఁ డెవ్వఁడైనఁ గృషిచేసినచోఁ దప్పక లోకోత్తర కళాచరిత్రుఁడగును.

# 1. శకుంతవాణి

## ప్రథమ భాగము

ఒకానొకప్పు డరేబియాదేశములోని యొక ప్రసిద్ధ నగరమున మిక్కిలి భాగ్యశాలి యగు నొక వర్తకుఁ డుండెను. అతని కొక్కఁడే కుమారుఁడు. ఐశ్వర్యముకంటె విద్యయే విలువగలదని యెఱిఁగిన యా వర్తకుఁడు కుమారుని విద్యావిషయమై బాల్యమునుండియు జాగరూకత వహించెను.

ఆ బాలుఁడు పదియేండ్ల వయస్సునఁ దండ్రితోఁగూడ మక్కాయాత్రకుఁ బ్రయాణమై పోయెను. మార్గమధ్యమున వా రీజిప్టులోని యొక పట్టణమును సందర్శించిరి. అందొక సందునఁ బోవుచుండఁగా బురాతన పద్ధతితో నిర్మింపఁబడిన యొక యింటినుండి కొన్ని వింతధ్వనులు వారికి వినిపించెను. కుతూహలముతో వా రా యింటిలోని కేఁగిరి. అది యొక పాఠశాల. అందలి యుపాధ్యాయుఁడు వృద్ధుఁడు. రాగివన్నె గల యతని గడ్డము చూపఱకు వింత గొలుపు చుండెను. అతఁడు తన శిష్యులకు 'ట్యూ, ట్యూ, ఛీప్, ఛీప్, ట్వీట్, ట్వీట్, ట్యూ, ట్యూ' అను వింతధ్వనులు గలిగిన పక్షుల భాష బోధించుచుండెను.

పాలిపోయిన నీలపు కనీనికలం దొక మెఱుపుతో నుల్లాసము వెలిఁబుచ్చు నా పండితుని సందర్శించి యావర్తకుఁ డిట్లనెను. 'అయ్యా! ఈ నా కుఱ్ఱవానినిఁ బక్షులభాష యందుఁ బండితునిఁ జేయవలె నని యభిలషించు చున్నాను. కనుక నిప్పుడే వీనిని దమ కొప్పగింతును.' ఆ పండితుఁ డా మాటలు విని



యా కుఱ్ఱవాని నొక్కసారి పరీక్షగాఁ జూచి వెంటనే ప్రాతగిలి యున్న యొక పెద్ద పుస్తకములో విద్యార్థుల పట్టికయం దతని పేరు నమోదు చేసికొనెను. పిమ్మట నా పాఠశాలనుండి వెడలిపోవు నపు డా వర్తకుఁడు బంగారు నాణెములతో నిండిన యాఱు సంచులను గురుదక్షిణగా నర్పించి యా యుపాధ్యాయు నితో నిట్లనెను. "అయ్యా! కుఱ్ఱని జాగ్రత్తగాఁ జూచు భారము మీదే. నా యాత్ర ముగిసిన పిమ్మట నరేబియాలోని నా స్వస్థానమునకు మఱలు నప్పుడు పిల్లవానినిఁ దీసికొని పోవుటకు మాత్రమే యిచ్చటికి వత్తును."

అటుతరువాత రెండేండ్లు గడచెను. కాని వర్తకుని జాడ లేదు. అతఁ డా పట్టణమునకుఁ బోఁదగిన మార్గమే

మఱచిపోయెను. తిన్నఁగా నరేబియాలోని తన పట్టణముఁ జేరెను.

'మనకుఱ్ఱవాఁడేడి?' యని యతని భార్య యాతురతతో నతనిని బ్రశ్నించెను. ఆమె కెట్లు సమాధానము చెప్పవలెనో స్ఫురింపక యతఁడొక కథయల్లెను. 'అయ్యో! ప్రియతమా! విధికి దయలేదు సుమా!' యని దీనముగాఁ బలికెను.

"వాఁడు గతించెనా యేమి?" యని యా యబల కన్నీరు విడువ సాగెను.

వర్తకుఁడు గుండె దిటవు పఱచుకొనుచు 'ఔను. చాల కాలము క్రిందటనే వాఁడు సముద్రమునఁబడి పోయె' నని యామెకు జవాబు చెప్పెను. అతఁడు చెప్పునది యసత్యమైనను, సత్యమే యని యామె నమ్మఁదగినంత దృఢస్వరముతోఁ బలికెను. దానితో హృదయము బీటలువాఱి కన్నులెఱ్ఱవడి వత్తలగు నట్లామె యొక వారము దినములవఱకు నెడ తెగక విలపించెను.

ఆ వర్తకుఁడు తన వ్యాపారపు గొడవలలోఁబడి కుమారుని మాటయే మఱచెను. ధన సంపాదనమే యతని జీవితమున నేకైకలక్ష్యము. ముదిమి మీఁద బడుచున్నను సరకుగొనక రెండవతూరి దూరప్రయాణమున కతఁడు సన్నాహము లొనర్చెను. 'నేఁడు చేయఁదగినది తేపటి కెన్నఁడు వాయిదా వేయరాదు' అను సూక్తి యతనికి విశేష వివేకవంతమైనట్లు తోఁచెనుగాని, శక్తికిమించిన పనులను మాత్రము 'వీలును బట్టి తేపుచేయుట కవకాశమున్న పనిని నేఁడే చేయఁబూనకు' మను దుష్టసిద్ధాంత మాతని కాచరణీయ మయ్యెను.

అయినను నింటికిఁ జేరిన పిమ్మటఁ బదియేండ్ల కొక నాఁటి యుదయమున రెండవ పయనమున కతఁడు నిశ్చయము చేసెను. "బహుశః యీసారి నేను తిరిగి యీజిప్టులో నా కుమారునిఁ బక్షులభాష నేర్చుకొనుటకు దిగవిడిచిన నగరమును సందర్శింపవచ్చును. వాఁడు కనిపించినచో మంచిదే; లేదా నష్టమేమున్నది?" అని యాతఁడు తలపోసెను.

అదృష్టవశమున నతఁ డీజిప్టునందలి యానగరమును జేరి యానాఁడు తాఁజూచిన సందులోఁ బాఠశాల కెదుట నిలఁబడెను. వెంటనే యందుండి వినవచ్చు 'ట్యూ, ట్యూ, ఛీప్, ఛీప్, ట్వీట్, ట్వీట్, ట్యూ, ట్యూ' అను వింతలైన శబ్దములచే నొకరి నడుగ వలసిన శ్రమలేకయే యదియే నాఁటి పాఠశాల యని గుర్తించెను.

కాని యానాఁటి వృద్ధ పండితుఁడు పాఠశాలలోఁ గనఁబడలేదు. అతని స్థానమున జ్యోతులవలెఁ బ్రకాశించు కన్నులు, నల్లని చాయదిరిగిన పై పెదవిగల యొక చక్కని యువకుఁడు కూర్చుండియుండెను. లోనికిఁ బ్రవేశించుట కనుమతిఁగొని యా వర్తకుఁ డచ్చటికిఁ జని, నాఁడు శైత్యాధారముచే వృద్ధ పండితుఁడు పాఠశాలకు రాలేదనియుఁ, దనకు బదులుగాఁ దర గతిలోనెల్ల బుద్ధిశాలి యగు నీయువకుని నితర విద్యార్థులకుఁ బాఠములు చెప్పుటకై నియోగించెననియు వినెను. ఇంతలో నెట్లో వర్తకునిరాక వృద్ధపండితునికిఁ దెలసెను. ఉన్నితోఁ జేయఁబడిన యుష్ణీషముదాల్చి, వెంటనే యా వృద్ధుఁడు పాఠశాలకు వచ్చి వర్తకునిఁ బలుకరించెను. 'ఏమి? మీ కుఱ్ఱ వానిని మీరు గుర్తింపలేకున్నారా? చిరకాలము క్రిందట

మీరు నా కొప్పగించిన యాబాలుఁ డదిగో! ఆ నిలఁబడి యున్న వాఁడే. అతఁ డన్ని విషయములందు సమగ్ర పాండిత్యము గడించినాఁడు. నాకుఁ బిమ్మట నా స్థాన మాక్రమింపఁ దగిన వాఁ డతఁడే!' యని యా యువకునిఁ జూపెను.

ఆనందముతో వర్తకుఁడు కుమారునిఁ గౌఁగలించు కొనెను. పిమ్మటఁ జూడ ముచ్చట గొల్పుచుఁ జేతి కెదగిన యా కుమారుని వెంటఁబెట్టుకుని తిరిగిపోవుచు నుపాధ్యాయునికి బంగారు నాణెముల సంచు లాఱు బహుమతిగా నిచ్చెను. శిష్యుఁడు తనయొద్ద సెలవు దీసికొను సమయమున నా వృద్ధ విద్వాంసుఁడు క్షణకాల ముద్వేగవశుఁ డయ్యెను. పాలి పోయిన యతని కంటిపాపలు మునుపటి మెఱపు గోల్పోయి నట్లు తోఁచెను. గురుశిష్యులు గాఢాలింగన మొనర్చుకొనిరి. వియోగ మన్నది చాల బాధాకరము. కనుకనే పెద్దలు 'ప్రపంచమున దేనియందును మమత్వము వహింపకు' మని చెప్పిరి.

తండ్రి కొడుకులు పడమటి వైపునకు సముద్రముపైఁ బయనము చేయుచుండిరి. విశాల సాగరముపై వారరుగు చుండఁగా మూఁడుపక్షులు వారి పడవమీఁదుగా నెగురుచుఁ దెరచాపలపై నిలిచి యేమో భాషింపఁ దొడగెను. పడవపై నున్నవారి కా పక్షుల రొద వినుగు గొలిపెను.

'బాబూ! ఆ పక్షులు మాటాడునదేమి ?' యని వర్తకుఁడు కుమారునిఁ బ్రశ్నించెను. కాని కుమారుఁడు మౌనము వహించెను. పక్షులు తమ సంభాషణ ముగియక ముందే యెగిరిపోయెను. కాని వాని 'ఛీప్, ఛీప్, ట్వీట్, ట్వీట్,

ప్యూ, ప్యూ, ట్యూ, ట్యూ' యను శబ్దము లుచ్చస్థాయిలో వినఁబడుచుండెను.

'ఏమి నాయనా? మౌనము దాల్చితివి? అవి నిజముగా నేమైనఁ బ్రసంగించుచున్నవో నా విషయమేమో నాకుఁజెప్పు' మని తండ్రి మఱలఁ గుమారు నడిగెను.

పడవలోఁగల వర్తకుని తోడివారు బాలునిఁ బరిహ సింప మొదలిడిరి. 'ఓ! ఈ పిల్లవాఁడు తన్ను దాను దెలియ నంత చక్కఁగాఁ బక్షులభాష నేర్చినాఁ' డని యొకఁడు గేలిచేసెను. 'పది సంవత్సరములపాటు విద్యాభ్యాసము! ఎంత యుజ్జ్వల ఫలితము!' అని మఱియొకఁ డనెను. ఆ కుఱ్ఱవాని కచట నుండుట దుర్భర మనిపించునంతటి మోటు మాటలు సాగెను. గంగాళమువంటి యుదరముగల యొక స్థూలకాయుఁడగు వర్తకుఁడు పొట్ట పగులునేమో యన్నంతగా విఱుగఁబడి నవ్వెను.

సరే! 'తండ్రీ! ఆ పక్షు లేమి మాటాడుచున్నదియు, నేను నీకుఁ జెప్పి తీఱవలె నందువేని, నా కభ్యంతరములేదు. కాని విన్నపిమ్మట నీవు బాధ పడుదు' వని యా కుఱ్ఱవాఁడు తండ్రి నుద్దేశించి పలికెను.

'చెప్పవలసినదే! చెప్పవలసినదే!' యని తండ్రి నొక్కి పలికెను. ఇతర వర్తకులును నేకగ్రీవముగఁ 'జెప్పవలసినదే, చెప్పవలసినదే' యని వంత పలికిరి.

అప్పుడా బాలుఁడు తండ్రినిఁజూచి యిట్లనెను. 'నే నొక రాజు నగుదు ననియు, నీవు నా కొలువులో భారవాహుఁడ వగుదు' వనియు నవి యనుకొన్నవి.

ఒక్కసారిగా నవ్వు లాఁగిపోయెను. అందఱి మొగము లందును నసహ్యాభావము పస్ఫుటమయ్యెను. వర్తకుఁడు పెదవి కొఱికికొనెను. ఏమియుఁ బలుకలేదు. కాని మఱుక్షణమునందుఁ దన పరాభవమునకుఁ బ్రతీకారము చేయవలె నను నిశ్చయము నకు వచ్చెను.

ఆ సాయంకాలమంతయు నావలో నొకమూల నతఁ డొం టరిగఁ గూర్చుండి యాలోచింపఁ జొచ్చెను. ఏదో నిశ్చయము చేసెను. అర్ధరాత్రమయ్యెను. ఆకాశము కాటుక పులిమిన ట్లుం డెను. ఒక మహారక్షస్సువలెఁ బడవ నీటిపై దూసికొని పోవు చుండెను. వెంటనే వర్తకుఁడు లోనికిఁ బోయి యొక కొయ్య పెట్టెలోని సరకులను గ్రుమ్మరించి, నిద్రాసక్తుఁడై యున్న తన కన్నకుమారు నందు బంధించి నీటఁ బాఱవైచెను. ఆ పెట్టె నీటఁబడి యూగులాడుచు, నదృశ్యమగుచుండఁగాఁ బరీక్షించి చూచి యా వర్తకుఁడు "ఓహో! పక్షులెంత జోస్యము తెలిసినవి? ఈ పర్యాయము నే నింటికిఁ బోఁగానే, నాభార్యను గలసికొన్న ప్పుడు 'మనబిడ్డఁడు సముద్రమునఁ గూలిపోయె'నని గట్టిగా మఱియొకమాఱు చెప్పుదును. ఈ మాఱు నేను నిజమే చెప్పి నట్లు కాఁగల" దని తలపోసికొనుచుఁ దనసెజ్జఁ జేరి, యున్ని దుప్పటి దిట్టముగా ముసుఁగు వెట్టి, నగుమొగముతో నిద్రకుఁ జొచ్చెను.

ఆ పెట్టె నీటిపైఁదేలుచు అదృష్టద్వీపమువైపు కొట్టుకొని పోయెను. వర్తకుఁడు తిన్నఁగా నింటికిఁ జేరెను. కాని యిల్లె క్కడ! అందొక బొగ్గులగుట్ట కాన్పించెను. గుండె తటతట గొట్టుకొనుచుండ నిరుగుపొరుగువారిని విచారించి యతఁడు భార్య



నిద్రాసక్తుఁడై యున్న తన కన్నకుమారు నందు బంధించి నీటఁ బాఱవైచెను.

తలదాచుకొన్న చోటికిఁ బోయెను. ఆమె గుర్తు పట్టుటకు వీలు గానంతగా మాఱిపోయినది. శ్రమచేతను నాయాసముచేతను నామె కళవళించు చుండెను. ఒడలిలో రక్తమే లేనట్లుండెను. వర్తకుఁడు దేశాంతరమం దుండఁగా సర్వభక్షకుఁ డతని యింటఁ బ్రవేశించి సమస్తముఁ జూఱగొనుటచే నామె కాదుర్దశ కలిగెను.

జీవితములో నెప్పటి కప్పుడేదో యొక చింతావ్రణము పొడసూపుచునే యున్నను, గాల మన్నది యట్టి యెంతంత గొప్ప వ్రణములనైన మాను పట్టింపఁగలదు.

రెండేండ్లా యూరనే యా దంపతు లష్టకష్టము లనుభ వించి యింక నందు జీవింపఁజాలక మఱెందైన సుఖ జీవనము లభింపవచ్చు నను నాశతో స్వస్థలము వీడిపోవుటకు నిశ్చ యించిరి.



ఇఁక మన మా కొయ్యపెట్టె యేమైనదియు విచారిం తము. ఎడతెగని యలలలో నిట్టట్టు నడుచు నదృశ్యమూర్తి యగు విశ్వరక్షకునిచే భద్రముగాఁ గొనిపోఁబడినదో యన్న ట్లొక వినూత్న భూభాగముఁ జేరుచుండెను. పల్లెవాఁడొకఁ డచ్చటఁ గూర్చుండి నీటిలో గాలము నాడించుచుండెను. ఎందుకో వాఁడు తలయెత్తి చూడఁగా నల్లంత దూరమున నాపెట్టె కాన్పిం

చెను. 'ఐతే అదృష్టము! అది చాల పెద్దపెట్టె. అందులో నేముం డునో యెవరికిఁ దెలియును!' అని తలఁచుచు వెంటనే తన దొన్నెకడకుఁ బోయి యందెక్కి యా పెట్టెవైపు పోసాగెను.

ఆపెట్టె యతనివైపునకే వచ్చుచుండెను. అది బాగుగా దగ్గఱకు రాఁగానే పెట్టె కొకవైపున గట్టి మోకు బిగించి లేవనెత్తి దోనెలోఁ బెట్టెను. కుతూహలాతిశయముతో నతని హృదయనాడి తీవ్రముగా స్పందించెను.

అతఁడు వెనుదిరిగి తీరముఁ జేరినంతనే పెట్టె వీఁపున నిడికొని యింటి మొగమై యరిగెను.

గృహముఁ జేరిన పిమ్మట భార్యాభర్తలు దాని మూఁత తెఱచిరి. అం దొకయువకుఁ డున్నతవంశమునకుఁ జెందుట తెలుపు నట్టి దుస్తులు ధరించినవాఁ డుండుట వారి కత్యం తాశ్చర్యము గల్గించెను.

'అయ్యా! నీవు దయ్యమవా? మానవుఁడవా?' అని వారైక కంఠ్యముగఁ బ్రశ్నించిరి.

'నేను మీవంటి రక్తమాంసమయ మగు మానవ శరీ రముఁ గలవాఁడనే. నన్నుఁ జూచి మీరు భయపడవల'దని యా యువకుఁడు వారికి బదులు చెప్పెను.

"నిస్వార్థము, నిర్మలము నగు భావముతో వారొసంగిన యాహార మారగించి, యుచిత మర్యాద లందికొని యతఁడు వారితో నిట్లు పలికెను. 'ఇఁకనుండి మీరే నా తల్లిదండ్రు లన వలెను. ఈ విలువగల దుస్తులను బజారులో విక్రయింపుఁడు. వానికి మంచి వెల గిట్టఁగలదు. ఆ ధనము మీ యవసరములకు

వినియోగపడఁగలదు. నే నిప్పటినుండి మన పేద బ్రతుకునకుఁ దగిన దుస్తులే ధరింతును.'

## ద్వితీయ భాగము

ఆ దేశ మేలు రాజున కొక యసాధారణ కారణమున విశేషమైన మనోవ్యథ సంభవించెను. ప్రత్యుదయ మతఁడు కొలువు దీర్చువేళకు మూఁడు పక్షులు వచ్చెడివి. కొంతసే పుచ్చైస్స్వరమున నేమేమో మాటలాడెడివి. ఆ రొదలో రాజు మాటలు సభలో వినిపించెడివి కావు. అంతకంటెను దుర్భర మేమనఁగా నవి యెగిరిపోవుటకు మున్ను దురదృష్టవశమున బట్టతల గల రాజు నెత్తిపైఁ దమ తెక్కలఁ కంటుకొన్న దుమ్ము రాల్చి పోయెడివి. రా జది సహింపలేక పోయెడివాఁడు. 'ఈ పక్షులు మర్యాద యెఱుఁగని' వని యఁత డెన్నో సార్లు ఘో టించెను. సభాసదులును నతనితో నేకీభవించిరి.

'ఈ దుస్థితినుండి నన్నుఁ దప్పించువారి కర్ధరాజ్య మిత్తు' నని యతఁడు దేశమంతటఁ జాటింపించెను. కాని యందులకు బ్రయత్నించి కృతార్థుఁడు కానివానికిఁ దక్షణము శిర ముత్తరించుట జరుగుననియుఁ బ్రకటించెను. రాచఱికపు సహనమునకుఁ బరీక్షగా జరిగెడి యా పక్షులచర్య నివారించుటకు 'నే' నని యొక్కఁడును ముందంజ వేయఁ డయ్యెను.

ఒకనాఁడు రాజు తన ప్రధానినిఁ బిలిపించెను. 'ఈ పక్షు లిట్లు చేయుటకుఁ గారణము తెలుపఁ గలవాని నెవనినైన, నొక వారము దినములలో నీవు కనిపెట్టి, నా యొద్దకుఁ దీసికొని రానిచో, నీమెడపైఁ దల నిలువ'దని కఠినముగా శాసించెను.

ఆ ప్రధాని యదృష్టవశమునఁ బిల్లైవాని యింటికిఁ జేరిన యువకునిగుఱించి వినెను. అతనినిఁ జూచుటకై పోయెను.

ఆ యువకుఁ డతనినిఁ జూచి నవ్వి 'నీకుఁ దల లేన ట్లున్న దేః' యనెను. ఆ యమాత్యుఁడు చలింపకుండ నతనితో రాజునకుఁ బక్షులవలనఁ గలిగిన బాధయు, దానినిఁ దప్పింపఁ గల వాని కొఱఁ డిత్తునన్న బహుమతియు సవిస్తరముగా నెఱింగించెను.

వెంటనే యా యువకుఁడు తా నప్పుడే రాజునొద్దకుఁ బోయెద నని పలికెను. కాని వానిని గాఢముగాఁ బ్రేమించిన పల్లైదంపతులు మాత్ర మతని నా ప్రయత్నమునుండి నిరుత్సాహ పఱుపఁ దొడఁగిరి. ఆ యువకుఁడు తన కా యత్నమున విజయము నిశ్చయమని విశ్వసించి తాను క్షేమముగాఁ దిరిగి వచ్చుటయే కాక, యా యుద్యమ ఫలముగాఁ దాను మకుట ధారియై వచ్చుట సంభవించునని చెప్పి వారి నొప్పించెను.

మఱునాఁటి యుదయమునఁ బ్రధానితో నతఁడు రాజసభ కేగెను. మంత్రి యంజలిబద్ధుఁడై రాజు నుద్దేశించి 'మహాప్రభూ! శకుంత వాఙ్మయమున నాఱితేఱిన పండితుఁ డీ యువకుఁడు. ఇతఁడు మీ చిరకాలవాంఛఁ దీర్పఁగలఁ' డని విన్నవించెను. అతఁ డిట్లు నుడువుచుండఁగనే యథాప్రకారముగాఁ బక్షుల యఱజడి ప్రారంభమయ్యెను. యువకుఁ డతి శ్రద్ధతో వాని పలుకులందలి ప్రత్యక్షరమును నాలించి రాజు ననుమతితో నిట్లనెను. 'మహా రాజా! తమ యుద్యోగుల నర్ధరాజ్య ప్రదానమునకై వలయు దానశాసనము లిఖించుట కాజ్ఞాపింపుఁడు. అది ముగిసిన పిమ్మ

టనే యీ పక్షుల సంభాషణలోని యంశమును మీ కెఱింగింపఁ గలను.'

అతని విజ్ఞప్తి యెట్టిదైనను బాలించుటకు దనకేమియు నభ్యంతరము లేదని రాజనెను. అతని యంతరాంతరములలో సర్వరాజ్యము గ్రహించుటకు మున్నే యా యువకుఁడు తన శిరము గోల్పోఁగలఁ డను విశ్వాస ముండెను.

దాన శాసనము వ్రాయుట ముగియఁగనే యువకుఁ డిట్లు చెప్పఁ దొడఁగెను. "మహారాజా! అవి న్యాయము కొఱకుఁ ద మ్మర్థించుచున్నవి. వానిలో రెండు మగవి. ఒకటి యాడుది. తమ కెడమవైపునఁ గల యీ పక్షి తూర్పుదేశమునకుఁ జెంది నది. కుడివైపునఁగల యది పశ్చిమ దేశమునకుఁ జెందినది. ఒకప్పు డీ యాడుపక్షి యీ రెండవపక్షికి భార్యగా నున్నది. ఈ పడమటి పక్షి యొక పయనమున కని పోయి చాలకాలము వఱకు దీనికిఁ గనిపింపక దూరస్థలమం దున్నది. ఆ కారణమున నిది మరణించియుండు ననుకొని, పక్షికాంత యీ తూర్పుదేశపుఁ బక్షిరాఁగా, దీనితోఁ గాఁపురము చేయ నారంభించినది. ఒక సంవత్సరమిట్లు గడచిన వెనుకఁ బశ్చిమ దేశపు శకుంతము దీనియొద్దకు వచ్చినది. ఇప్పు డొక విడఁదీయరాని చిక్కు కలిగె నని దేవర గ్రహింపఁగలరు. ఈ చిక్కు విడఁదీయవలయు నని యవి ప్రభువుల నర్థించుచున్నవి."

ప్రభు వా సమస్య నెట్లు పరిష్కరింపవలెనో నిశ్చయింప లేకపోఁగా, ననుమతిఁ గొని, యువకుఁడే యందులకుఁ బూనెను. అతఁడు ప్రాగ్దేశపుఁ బక్షినిఁ జూచి యిట్లనెను. 'పక్షీ! నీవు తిరిగి నీ స్థానమునకుఁ బొమ్ము.' పిమ్మటఁ బడమటి పిట్టను జూచి

'నీవు నీ స్వస్థానమున కెగిరిపొ'మ్మని, పక్షికాంతను జూచి 'శకుంతకాంతా! నీ కెవరియందు మక్కువ గలదో వారియొద్దకుఁ బొ'మ్మని పలికెను. ఆ శకుంత కాంత తత్క్షణమే పశ్చిమ దిక్కునఁ జను తనభర్త ననుసరించెను. అతనియం దామెకుఁ గల మక్కువ యట్టిది.

సభాసదులు హర్షమునఁ జప్పట్లు చఱచుచు నా యువకునిఁ దమ చేతులతో సభాభవనపుఁ బైభాగమువఱ కెత్తి యభినందించిరి. కాని రాజాయభినందనోత్సవమునఁ బాల్గొనఁడయ్యెను. అతఁడు తన యర్ధరాజ్యము వదలుకొనుట కొప్పుకొనవలసి వచ్చెను. అదియు నెందులకు? మూఁడు పక్షులు పాడు ట్వీట్ ట్వీట్, ఘ్యా ఘ్యా, ఫ్యూ ఫ్యూ, ట్వీట్ ట్వీట్, చిట్ చిట్, శబ్దముల నిమిత్తమై. లేఖకులు తెచ్చిన దాన పత్రముమీఁద సంతకము చేయుటకు మొండి తిరస్కారముఁ జూపెను.

'ఓహో! రాజా! నీ బాసఁ దప్పించుకొనుటకై నీవు చేయు ప్రయత్నము నిరర్థకము సుమా! బాసయన్నది పరమ పవిత్రము. ఒకసారి మాటయిచ్చి భంగముఁ జేయరాదు. ఈ దానశాసనముపై నీవు సంతోషముతోఁ జేవ్రాలు చేయక పోదువా? ఎంతో విచారముతో నైన నీవు దానిపై సంతకముఁ జేయునట్లు నేఁ జేయవలసి వచ్చును. ఎట్లందువా? గ్రద్దలు, డేగలు మొదలైన పక్షిజాతు లన్నింటిని రప్పించి నీ బ్రతుకే యసంభవముగాఁ జేయునట్లు నేను శాసింపఁగలను' అని యా యువకుఁడు నవ్వుచుఁ బలికెను. కాని రాజున కది యొక యశక్తుని బెదరింపువలె మాత్రమే తోఁచెను. 'ఓయి కుఱ్ఱ

వాఁడా ! నిన్నుఁజూచి నేనేమియు భయపడుటలేదు. నీవొక వాక్చాతురుఁడవు మాత్రమే' యని యతఁడు యువకునకు సమాధాన మిచ్చెను.

తత్క్షణమే యాయువకుఁ డుచ్చైస్స్వరమునఁ గొన్ని వింత శబ్దము లుచ్చరించెను. ఇంకేమున్నది? ఆకాశమంతట నొక నల్లని మబ్బు వ్యాపించినట్లు కాన్పించెను. రా జది చూచి 'వాన సాగునట్లున్న' దనెను. యువకుఁ డామాటలకు నవ్వి యిట్లనెను. 'వాన యెంతమాత్రము సాగదు. అట్లై నీ వానయిచ్చుటయు సాగదు.' అతని మాటలకు సభయంతయు గొల్లున నవ్వెను. మబ్బువలెఁ దొలుతఁ గనఁబడినది; రానురాను రాజభవనముపై వాఁగి, దిగివచ్చుచుఁ బక్షులసేనగా రూపుకట్టెను. ఆ సేనలో నానాజాతి విహంగములు గాన్పించెను. వంపుదిరిగిన ముక్కులు, బలమైన ఱెక్కలుగల మహాశకుంతములు కొన్ని, ఱెక్కలల్లార్చుచుండఁగా విపరీత శబ్దము పుట్టించుచు, రక్కసి గోళ్ళుగలిగి, యుక్కు బొమ్మలవంటి భీకరఖగములుకొన్ని, వర్ణనాతీతములైన పిశాచపక్షులు కొన్ని, యింకను బలుజాతులకుఁ జెందిన ఘోరపక్షు లనేకములు గనవచ్చెను. వానికన్నులు కణకణలాడు బొగ్గులవలె నెత్తుటిరంగు వేలార్చుచుండెను. తప్పించు కొనరాని వ్యూహముతో నొక దయ్యపుఁ బక్షుల పటాలము తన నగరము ముట్టడించె నని రాజు గ్రహించెను.

'ఆఁ! ఆఁ! ఈ పక్షుల నన్నింటిని వానివాని పర్వత గృహములకు, నదీవాసములకుఁ బంపించివేయు'మని యతఁడు యువకుని వేడుకొనెను. ఱేని నిస్సహాయస్థితి సభ కాశ్చర్యమే కాక, వినోదమును గల్గించెను. 'ముందు సంతకముచేయు'మని



దానపత్రముపై 'ముందు సంతకముచేయు' మని యువకుఁడు వికటముగ నవ్వుచు గర్జించెను.

యువకుఁడు వికటముగ నవ్వుచు గర్జించెను. కంపించుచున్న చేతితో రాజు తలవంచి దానపత్రముపైఁ జేవ్రాలు చేసెను. యువకుఁ డామఱునిమిసముననే పక్షులన్నింటికి వాని గూండ్లకు బర్వత గుహలఁకు బోవ సెలవిచ్చెను.

ఆ వైచిత్ర్య మంతయుఁ జూచుచున్న యమాత్యుఁడు తనలో 'ఈ యువకునిచర్య సమంజసముగనే యున్నది. రాజు గౌరవముగ సంతకము చేయకపోయెను. ఇట్లగౌరవము పొందిన పిమ్మటఁ జేసినాఁడు' అనుకొనెను.

పిమ్మటఁ గాలక్రమమున యువకునితోఁ బరిచయము హెచ్చినకొలఁదియు రా జాతని నెంతోప్రేమింప మొదలిడెను. అతని పెంపుడు తల్లిదండ్రులగు పల్లెదంపతులను బిలిపించి యమూల్యములయిన బంగారు సరిగంచు వలువలు కట్టఁబెట్టెను.

తరువాత స్వల్పకాలముననే రాజు మరణించెను. కాని మరణించుటకుఁ బూర్వము తనవశమం దున్న యర్ధరాజ్యము గూడ నా యువకుననే చెందునట్లు పత్త్రము వ్రాసెను. ప్రజ లంద ఱా విషయము విని యిట్లనుకొనిరి. అహా! అదృష్ట మన్నది యెంత చిత్రమైనది! అది నవాబులను ఫకీరులను; ఫకీరులను నవాబులను జేయును!

ఇంతలో నరేబియా దేశమందలి యీ యువకుని జననీ జనకులు స్వస్థానము విడిచి యందందుఁ దమ యదృష్టముఁ బరీక్షించుకొనుచు నీ నగరముననే వచ్చుట తటస్థించెను.

అప్పటికిఁ జలి ముదురఁ జొచ్చెను. చలికాలముగడపుటకు వలసినన్ని కట్టెలు సేకరింపవలసిన దని క్రొత్తరాజు సేవకుల కాజ్ఞ యిచ్చెను. సేవకులు భారవాహుల నన్వేషించి రాజాజ్ఞ

శీఘ్రముగా నెఱవేర్చుటకుఁ బ్రయత్నించుచుండిరి. ఆ వర్తకుఁ డా సేవకులయొద్దకుఁ బోయి తనకుఁగూడ నొక పని కల్పింప వలెనని యాశ్రయించెను. రాజసేవకు లవసరమును బట్టియు, నతని దీనాలాపములను బట్టియు నతనిని దమ పరివారమునఁ జేర్చుకొనిరి.

వర్తకుని భార్యకూడ నంతఃపురములో వస్త్రము లుదుకుటకుఁ గుదిరి, తన కర్తవ్యమును శ్రద్ధాభక్తులతోఁ జేయుచు విశ్వాసపాత్రురా లయ్యెను.

ఒకనాఁటి యుదయమున రాజు సౌధాగ్రమందుండి గవాక్ష మూలమున పెఱటివైపు చూచుచుండెను. ఎందఱో కూలివాం డ్రందుఁ బని చేయుచుండిరి. ఆ కూలివాండ్రలో నొకనిముఖ మతనికి మున్నెప్పుడో బాగుగా జూచిన ట్లుండెను. ముక్కుచు మూల్గుచు సతమతమగు నా కష్టజీవియం దతనికి జాలి కలిగెను. ఆ కూలివాఁ డతివృద్ధుఁడు. వీఁపున నున్న బరువు మోయలేక యిటునటు తూలుచుఁ బెనఁగుచు నెట్లెట్లో వచ్చుచుండెను. అతనినిఁ దన సమక్షమునకుఁ దీసికొని రావల సిన దని రాజు తన చెంత నున్నవారి కాజ్ఞాపించెను.

'నీకొక కుటుంబము అనఁగా ఒక భార్య, ఒక కుమా రుఁడు గలరా?' అని తన యెదుటికి వచ్చిన యతనిని సాదర ముగఁ బ్రశ్నించెను.

'దేవా! నాకొక భార్యయున్నది; కాని, కుమారుఁడు లేవేలేఁ' డని యా వృద్ధుఁడు పలికెను.

కాని, యిప్పుడుమాత్ర మతఁడసత్యమును సత్యముగా ధ్వనింపఁ జేయలేఁ డయ్యెను. ఏలయనఁ దనభార్య యుదుకు చున్న వస్త్రములు తన యంతఃకరణముకంటెను నిర్మలములని యతఁ డెఱిఁగియుండెను.

'అయినచో నీ భార్య యెక్కడ?' నని రాజు తిరిగి ప్రశ్నించెను.

'అయ్యా! ఆమె మహాప్రభువుల యంతఃపుర పరిచారిక లలో నొకతిగాఁ బనిచేయుచున్న'దని వృద్ధుఁడు మాఱుపలికెను.

'ఆమెను నా యెదుటికిఁ గొనిర'మ్మని ప్రభు వాజ్ఞాపించెను. ముసలివాఁ డాపాదమస్తకముగాఁ గంపించెను. ప్రభు సమక్షమునఁ దన నైచ్యమంతయు నామె వెల్లడించు నను భయము కలిగెను.

ఎట్టకేలకు వానిభార్య రాజ సమక్షమునకు వచ్చెను.

'ఓ పేదరాలా! ఏ దౌర్భాగ్యమున మీరిట్లు రావలసి వచ్చెను? మిమ్ములను జూడఁగా నొకప్పుడు మంచిరోజులు చూచినవారుగాఁ దోఁచుచున్న'దని రా జామెను బ్రశ్నించెను.

'అయ్యో! ప్రభూ! ఏనాఁడు మా కుమారుఁడు సముద్ర మునఁ బడిపోయెనో, నాటినుండియే మా చెడురోజు లారం భమైన' వని యా వృద్ధురాలు గద్గదస్వరముతోఁ బలికెను.

'అమ్మా! నీబిడ్డను నీవు తిరిగి చూడఁగల పక్షమున నతనిని నీవు గుర్తింప గల్గుదువా?' యని ప్రభు వామె కన్ను లలోనికి సూటిగాఁ జూచుచుఁ బ్రశ్నించెను.

'తప్పక గుర్తింపగలను ప్రభూ! వాని కొక యంద మైన పుట్టుమచ్చ యున్నది. అదియు వాని యెడమ బుజము

మీఁద. అది యెంతో వింతయందము గలది.'

అనుచరులును, సేవకులును వింత పడుచుండగాఁ బ్రభువు తన యెడమబుజముపై నంగీ తొలగించెను. వెంటనే యా వృద్ధాంగన తాను చెప్పిన పుట్టుమచ్చ యట్టిదే యని గుర్తించెను.

'నా కన్నతండ్రీ! నా నాయనా!' యనీ యామె చిర కాలమునుండి యతికష్టమున నణఁచుకొనుచున్న యుద్వేగము పెల్లుబికి విలపింప మొదలిడెను.

ఆ వృద్ధున కేమి చెప్పుటకు దోఁచలేదు. తాను కల గనుచుంటి నని భావించెను.

తండ్రి తనకుఁ బూర్వము చేసినయపకారము మన్నించి రాజు, తల్లి పాదములంటి నమస్కరించెను.

గులాబియత్తరు కలిసిననీట జలకమాడి, రాజోచితము లయిన దుస్తులు దాల్చి యా వృద్ధ దంపతులు తమ జీవిత శేషము సంతృప్తితో శాంతి మయముగాఁ గడపిరి. పల్లె వాఁడును నతని భార్యకూడ వారితోఁ గలసి మెలసి యుండ, విస్వార్థు లగుటవలనఁ గలకాలమునకుఁ దమ దత్త పుత్త్రుఁడు విజ జననీజనకులఁ గలసికొన్నందులకు సంతసించుచు సుఖ ముగాఁ గాలము గడపిరి.

'పక్షులు నిజముగా గొప్పజోస్య మెఱిఁగినవి' అని యావర్తకుఁడు 'నీకుమారుఁడు రాజగును; నీవతని కొలువున భారవాహుఁడ వగుదు'వని పడవ తెఱచాపపైనుండి యానాఁడు పక్షులు పలికిన పలుకులు స్మరించుకొనెను.

---

# 2. పన్నా

వనవీరుఁడు మేవాడు దేశపాలకులలో సుప్రసిద్ధుఁడైన సంగ్రామసింహుని కొలువులోఁ గల యొక చిన్న యుద్యోగి. వాఁడు పరులను వంచించుటలో నేర్పరి. వంచకులకు సహజమైన యాత్మభావగోపనము, విషపునవ్వు వాని కుగ్గుఁబాలతో నలవడినవి. సంగ్రామసింహుఁ డతని బాహ్యలక్షణములఁ జూచి మోసపోయెను. అతని యందు విశేషమైన విశ్వాస ముంచెను. అతఁడు తన కుడిభుజమే యనుకొనెను.

అచిరకాలములోనే మహారాణా వనవీరుని నల్పాల్ప పదవినుండి ప్రధానమంత్రి పదవికిఁ దెచ్చెను. ఈ యెన్నిక చాల నౌదార్యముతోడను, నుచితజ్ఞతతోడను గూడియున్నదని యాస్థానోద్యోగులెల్ల రభిప్రాయపడిరి. అట్లు భావింపనివాఁ డొక్కఁడు మాత్రమే. వాఁడు రాచమంగలి. మానవుల చిత్తవృత్తు లెరిఁగిన వాఁడు. చిరకాలానుభవముచేతను, దనయొద్ద కాయుష్కర్మకై వచ్చు ననేక వ్యక్తులతోఁ గల పరిచయము చేతను, మానవుల ప్రకృతు లెట్టివో వారి మనస్సులలో నెటువంటి తలంపులు తీఁగలు సాగుచుండునో, యతఁడు గ్రహింపఁ గలిగెను.

'నేను కేవలము మంగలిని. కేశములు ఖండించి శిరస్సు నిలుపుట నా కులవృత్తి. కొందఱు జాణలు శిరము ఖండించి శిరోజములు మాత్రము నిలబెట్టుదు'రని యతఁ డనుచుండెడి వాఁడు. అతని యీమాటలు విన్నవా రొక నవ్వునవ్వి గొప్ప చమత్కారపు మానిసి యనుకొనుచుండిరి. కాని కాలము

గడచినకొలఁదియు, వానిమాటలయందు హాస్యముకంపెను. దివ్యజ్ఞాన మిమిడియున్నట్లు స్పష్టము కాఁదొడఁగెను.

కొన్నాళ్ళకు సంగ్రామసింహుఁడు మరణించెను. మరణ శయ్యముపై నుండఁగనే, తన రాజ్యమున కుత్తరాధికారియుఁ దన కుమారుఁడు నగు నుదయసింహుఁ డను నాఱేండ్ల బాలుని వనవీరున కొప్పగించెను. ఈ విధముగా వనవీరుఁడు రాకుమా రుని ప్రతినిధిగా దేశము నేలఁదొడఁగెను.

అతఁడు పసివాఁడైన యువరాజును పన్నాయను రాజ పుత్త్రిస్త్రీ పెంపకమున నుంచెను.

ఆమె యతనియం దధికశ్రద్ధవహించి కన్నతల్లి వలెఁ బెంచుచుండెను. ఆమెకు యువరాజు నీడువాఁడగు కుమారుఁ డుండెను. పన్నా చాలకాలమునుండి రాజకుటుంబమును విశ్వాస ముతో సేవించుచు నందఱి మన్ననలకుఁ బాత్రమైయుండెను. ఆమె యుదయసింగు తల్లికేగాక యతని పితామహికిని నమ్మిన పరిచారికగా మెలఁగినది. కనుక రాజకుటుంబముతో నామెకుఁ గల సంబంధము రెండుతరములుగాఁ గొనసాగియుండెను.

పన్నా సంరక్షణమున రాకుమారుఁడు పెరుగుటతోఁబాటు వనవీరునికి రాజ్యకాంక్షయును బెరుగుచుండెను. మకుటధారి యైన మహారా జగుటముందు ప్రధాన మంత్రిత్వ మొక లెక్కయా? యువరాజు పెద్దవాఁడై సింహాసనమెక్కినచో రాజసంరక్షక పదవితో నిమిత్తమేముండును? ఆశయన్నది యెంత నైచన్యమునకైన లోఁబఱచును. దానికి నిలుపుదల లేదు. అధికార మను మద్యము మనుష్యుని గ్రుడ్డివానినిఁ జేయును.

ఎన్నెన్నో యకార్యములు చేయించును. ప్రభువు తన కొప్ప గించిన సింహాసనమును దా నాక్రమింపవలెను; రాజపుత్రస్థాన మందలి రాజు లందఱిలో భాగ్యవత్తముఁడు కావలె నన్నదే వనవీరుని యభిలాషము.

కలుషితరక్తముతో నతని నరనరములు స్పందించు చుండెను. అతఁ డొక్క నీచజాతిదాసికి జన్మించినవాఁడు. సాధారణ ముగా నగతికుఁడై తిండికొఱకటునిటు పరిభ్రమించుటో, యెవరి యొద్దనైన నొడ లమ్ముకొని నీచదాస్యముతోఁ దనువు దెల్ల వార్చుకొనుటో కాక యంతకంటె నున్నతస్థితి కలుగునని వాఁడు కలలోనైనఁ దలఁచియుండఁడు. కాని యతని యదృష్ట రేఖ యతని కూహాతీతమైన పదవిని సంపాదించి పెట్టెను. "నేను మేవాడు రాజా నగుదును. నా తరువాత నా కుమా రుఁడు, వాని తరువాత వాని పుత్రుఁడు. కాని యుదయసింహుఁడు జీవించియుండఁగా నిట్టి యభిలాషము పైకి జెప్పుకొనరానిది; ఫలింపనిదికూడ" నని యతఁ డనుకొనఁజొచ్చెను.

అతనిలోని పిశాచ మిట్లన్నది. 'ఈ యారేండ్ల నిసుఁగు నేల హత్యచేయరాదు? ఏల నీ మార్గము నిష్కంటకముఁ జేసి కొనరాదు? వనవీరుఁడా! అంతకంటె సులభము లేదు' వన వీరుఁ డిది చక్కని యాలోచన మనుకొనెను. తిరిగి పిశాచ మిట్లన్నది. 'అయినను నెవరిని నమ్మకుసుమా! ఏమందువా? నీకు విశ్వాసపాత్రుఁ డొక్కఁడును లేఁడు. నీవే స్వయముగా శిశుహత్య చేయవలెను.'

ఈ క్రూరకార్యము జేయుటకే వనవీరుఁడు నిశ్చయించెను. తన యుద్దేశ మతి గూఢముగా నుంచుకొనెను. అది యే

మాత్రము బయటఁబడినను రసపుత్రిరాజులు మాత్రమే కాక రాజభవనములోని యధమ భటులనుండియు నందఱు తనపైఁ బడి ఖండఖండములుగా నరకివేయరా ? తన్నుఁ గాకులకు గ్రద్దలకుఁ బెట్టరా ? అప్పు డీ కుతూహలముతోఁ దానును నస్తమింపకుండునా ?

'ఈ కార్యము నేను నా చేతులారఁ జేయవలయును. ఓసి జిహ్వా ! జాగ్రత్తసుమా ! నా యుద్దేశము నే మాత్రము పొక్కనీయరాదు.'

పగటి వెలుఁగునకు దూరమైన క్రూర శార్దూల గుహా మందిరమువలె నతని హృదయము తమోనిబిడ మయ్యెను. ఆ శార్దూలము రాకుమారునిపైఁ బగఁబట్టియుండెను. ఆ శిశువుపై దుముకవలెను; అతని మొగము రక్కివేయవలెను; గ్రుడ్లు పెకలింపవలెను; ఆ రక్తమాంసములతోఁ గడుపు నింపు కొనవలెను.

కాని వనవీరుఁడు ధూర్తాగ్రేసరుఁడు. అతని నవ్విప్పుడును జక్కెరవలె మధురముగాఁ బ్రకటితమగుచుండెను. ఆ హాసము లోని నిజతత్త్వము నెవ్వరును గ్రహింపలేకపోయిరి. 'నేను కేవలము మంగలిని. కేశములు ఖండించి శిరస్సు నిలుపుట నా కులవృత్తి. కొందఱు జాణలు శిరములు ఖండించి శిరోజ ములు మాత్రము నిలఁబెట్టుదురు.' అని చెప్పుచుండు రాచ మంగలి మాత్రమే దానిని గ్రహింపఁ గలిగెను.

పన్నావలెనే యీ క్షురకుఁడు కూడ రాజకుటుంబము నెన్నియేండ్ల నుండియో కనిపెట్టుకొని యున్న విశ్వాసపాత్రుఁ డైన వృద్ధ భృత్యుఁడు. అతనికిఁ బూర్వ మతని తండ్రి; ఆ

తండ్రికిఁ బూర్వము తాతయును, రాణావారి సేవలోఁ దనువులు చాలించినవారు.

వనవీరుని మంత్రిత్వము నామోదింపనివాఁ డతఁ డొక్కఁడే. అతఁడు వాని నభినందింపలేదు సరిగదా; వానిని శపింపు మని యిలువేల్పును బ్రార్థింపఁ దొడఁగెను. ప్రధాని పదవినుండి రాజకుమార సంరక్షకత్వము వనవీరున కేనాఁడు లభ్యమైనదో, యానాఁటినుండి యా రాచమంగలి మడతవిడిన తెలమీఁది చిత్రమువలె వనవీరుని మనసులోని యధికార వ్యామోహ మానాఁటివఱకు నెట్లు పరిణమించు చున్నదియు విలోకింపఁ గలిగెను.

అది రాత్రివేళ. ఆకాశమున నొక్క నక్షత్రమైన లేదు. రాజభవనము నలుదెసల గాఢాంధకారము. చేరువ యూరినుండి కుక్కయే డ్పొకటి వినవచ్చుచుండెను. అమాయికత యచ్చు వడ్డ మొగముతో రాజకుమారుఁ డుదయసింహుఁడు నిదురలో మునిఁగియుండెను. అప్పటివఱకు వానిని జోకొట్టిన పన్నా యతని నిద్ర గమనించి మెల్లఁగా నీవలకు వచ్చెను. సెజ్జకు దాపుగాఁ గూర్చుండి యతని నిమిత్తమై యొకచక్కని యంగీ కుట్టుట ప్రారంభించెను. కాని యామె మనస్సులో శాంతి లేదు. హృదయము తీవ్రముగా స్పందించుచుండెను. దూరమునుండి వినవచ్చు శ్వానరోదనము శుభసూచకముగాఁ దోఁపదయ్యెను. ఆరేయి యపాయకలితమని స్ఫురించుచుండెను. ఆమె యారోగ్యము శిథిలమైనట్లు నరములలో వేదన కలిగెను.

ఆకస్మికముగా నెవరో తలుపుఁ దట్టిరి. 'ఎవ రక్కడ?'

అని దాది ప్రశ్నించెను. 'పన్నా! తలుపు దెఱవుము. నేను. మంగలి'నను సమాధానము వచ్చెను.

ఆమె తలుపు దీసినది. మంగలి లోనికి వచ్చినాఁడు.. 'ఈ యర్ధరాత్రమున నీవు వినిపింప వచ్చిన వార్తయే' మని పన్నా యతని నడిగినది. 'శుభవార్త మాత్రము కాదు.' అను చుండఁగనే మంగలి కంటినుండి బాష్ప మొకటి చెక్కిలిపైఁ బడి జాఱినది. 'రాజపుత్త్రి రక్షకుఁడు రాకుమారుని వధించుటకు త్వరలోనే యిచ్చటికి రాఁగలడు.' అని యెండిన పెదవులతో నిట్టూర్చుచు నాపై నేమియుఁ జెప్పఁజాలని యతని వంకఁ బన్నా జాలిగాఁ జూచినది గాని, చిత్తస్థైర్యము గోలుపోలేదు. మౌనముగాఁ గొన్ని నిముసములు కూర్చుండి యిట్లన్నది. 'మనము రాకుమారుని రక్షింపవచ్చును.' 'అది యెట్లు?' అని క్షురకుఁ డాతురతతోఁ బ్రశ్నించెను. "ఈ కోటనుండి యతని నొక సురక్షితస్థానమునకు మనము కొంపోవుదము." మంగలి యిట్లనెను. 'అది యసాధ్యము. ఏమందువా? కోటనుండి. శిశువును వెంటనిడుకొని వెలుపలికిఁ బోవు నెవ్వరినైన నడ్డగించుటకై చాల బందోబస్తు చేయఁబడినది." స్త్రీ సహజమైన వివేకము, మాతృ సహజమైన పరిపూర్ణ వాత్సల్యము ప్రకాశితములుగా రాజనందనుని రక్షించుట కనువైన యొక యూహ స్ఫురించి పన్నా యిట్లన్నది. 'నేను రాజపుత్త్రి నొకతట్టలోఁ గూర్చుండఁబెట్టెదను. పనికిరాని కాగితములు మున్నగునవి తట్టపైఁ గనఁబడున ట్లమర్తును. నీవొక చెత్తయూడ్చు వానివలె నటింపవలెను. రాజభవనపు టావరణమున కావల నీ చెత్త పాఱఁబోయఁ బోవుచున్నట్లు ని న్నెవ్వరైన నడిగిరేని చెప్ప

వలెను. ఈ యర్ధరాత్రమున ని న్నెవ్వ రీ వేషమున ననుమానిం పరు. ఎవఁడో సేవకుఁ డను కొందురు."

మంగలి యామె చెప్పినదంతయు విని యిట్లనెను. "కాని, వనవీరుఁ డిక్కడి కిప్పుడే రావచ్చును. బాలుఁడు కనఁ బడనిచో వేఁట సాగించును. మనము పట్టువడుదుము." "నీవు నేను నుడివినట్లు చేయుము. ఇతని నొక సురక్షిత స్థానమునకుఁ జేర్పుము. ఇచ్చటి వ్యవహారమునకు నే నున్నా" నని, పన్నా



నిద్రించుచున్న రాకొమరునిఁ దట్టలోఁ బరుండఁ బెట్టి, మీఁదఁ జెత్తఁగప్పి మంగలి కొప్పగించెను. అతఁడు మాఱుమాటాడకుండ నామె చెప్పినచొప్పునఁ బోయెను. పన్నా యొంటరిగత్తె యైనది. ఆమె నిజపుత్త్రుఁడా ప్రక్క గదిలో నొకమూల నిద్రించుచుండెను. పన్నా తొందరగా నచ్చటికిఁబోయి నిద్రాభంగము గాకుండఁ గుమారు నెత్తుకొని రాకొమరుని పాన్పుపైఁ బండుకొనఁబెట్టి రాజపుత్త్రుఁడు ధరించు వస్త్రములు వానికిఁ దొడిగెను.

అప్పటికి నడిరేయి యైనది. ఒక్క నక్షత్రమైన లేని యా యర్ధరాత్రమున నా గడియలో నెంత కాఱుచీఁకటి! అయిన ను రాజభవనములో నున్న పన్నా హృదయమందు వలె భవనమునకు వెలుపల నంత చీఁకటి లేదు. హఠాత్తుగా నొక యడుఁగుల సవ్వడి యా నిశ్శబ్ద వాతావరణమును భంగపఱచెను.

కొన్ని క్షణములలోనే వనవీరుఁడు వచ్చి తలుపు దగ్గఱ నిలిచి మెల్లగాఁ దట్టెను.

వాఁడెవఁడో పన్నా గ్రహించినది; తలుపుఁ దీసినది. వనవీరుఁ డొక్కఁడే లోపలికి వచ్చినాఁడు. 'ఏమి పన్నా! రాకుమారుఁ డెట్లున్నాఁడు? నాకు వాని యారోగ్యము విషయమై యెంతో యాందోళన. ఎ ట్లున్నాఁడో చూచిపో వచ్చితిని.'

అనుచు నా కిరాతుఁడు నిద్రామగ్నమైన మూర్తి మీఁదికి వంగి యా చిఱుగుండియలోఁ దన కఱకు పిడిబాకు గ్రుచ్చెను. మఱుక్షణములో 'నమ్మా!' యనియైన నఱవకుండఁగనే యా పసివాఁడు ప్రాణరహితుఁడైనాఁడు. అతని నోటినుండి నెత్తురు పైకిఁ జిమ్మినది.

పన్నా కెవ్వుమని యొక్కకేక పెట్టినది. అది రాజభవనమంతట మాఱుమ్రోఁగినది. ఒక్కసారిగా గాఢ నిశ్శబ్దత భంగమైనది. ప్రతి గది, ప్రతి మూల నాధ్వని ప్రాకిపోయినది. సౌధమంతయు దద్దరిల్లినది. హంతకుఁడు భయాతిరేకముతోఁ బలాయితుఁ డైనాడు. రక్తసిక్త హస్తములతో నలువురి యెదుటఁ బడవలసి వచ్చునని యతఁ డూహింపలేదు.

నలువైపులనుండి గుంపులు గుంపులుగాఁ బరిచారకులు పఱువెత్తుకుని వచ్చిరి. పన్నా మూర్ఛితయై నేలఁబడియుండెను. రాకొమరుని పాన్పుపైఁ బసిబిడ్డ నెత్తుట మునిఁగి యుండెను. సౌధము హాహారవములతో బీటలు వాఱెను.

త్వరలోనే పన్నా మూర్ఛనుండి తెప్పరిల్లెను. జరిగిన దేమో తెలిసికొనుటకు జనులు గుమిగూడిరి. పన్నా యింతే యన్నది. 'ఒకనల్లని పీడ వట్టిచేతులతో నిందుఁ బ్రవేశించినది.



ఆ కిరాతుఁడు నిద్రామగ్నమైన మూర్తి మీఁదికి వంగి
యా చిఱుగుండియలోఁ దన కఱకు పిడిబాకు గ్రుచ్చెను.

నా దివ్యరత్నమును నా కన్నబిడ్డను, నా సర్వస్వము నపహ రించుకొని పోయినది!'

రాజకుమారుఁ డుదయసింహుఁడు ఘోర హత్యకుఁ బాలైనాఁ డనియే మేవాడుదేశ మంతయుఁ దలఁచెను. ఎవఁ డును హంతకుఁడు వీఁడని యెవ్వని ననుమానింపలేకపోయెను. అనుమానము కలిగినను నొక్కఁడైనను నోరు తెఱచి యే మాటయుఁ జెప్పఁజాలఁ డయ్యెను.

ఈ నడిమికాలములో 'ఆర్షా్ర్షా' యను వర్తకునింట నుదయసింహుఁడు పెరిగి పెద్దవాఁడైనాఁడు.

హఠాత్తుగా నొకనాఁడు 'రాజకుమారుఁ డుదయసిం హుఁడు బ్రతికియేయున్నాఁ'డను వదంతి పుట్టెను. ఉదయసిం హుఁడు తన రాజధానికిఁ దిరిగివచ్చి, రాజ్యాపహర్తయగు వన వీరునిఁ బదభ్రష్టుని జేయుట కది తగిన తరుణ మని యెరిఁగిన పన్నాయే యా వదంతిని విస్తరింపఁజేసెను.

ఉదయసింహుఁడు కొలదినాళ్ళకే మేవాడునకుఁ దిరిగి వచ్చెను. హర్ష పులకితులయి యనుచరులెల్ల రతని గుర్తించిరి. వనవీరుఁడు పట్టుపడినాఁడు. వెంటనే యతనికి శీర్షచ్ఛేదము గావింపఁబడినది. ఉదయసింహుఁడు గద్దె నెక్కినాఁడు. నాఁటి కాలమున రాజపుత్రస్థానములోని త్యాగమూర్తులయిన వీరకాంత లలో నగ్రగణ్యురా లని పన్నా కొనియాడఁబడినది.

దేశములోని ధైర్యశాలినులయిన స్త్రీలలోనే కాక, ప్రపంచ ప్రసిద్ధ ధీరవనితలలో నొకర్తుకగా నామె యీనాఁటి కినిఁ బ్రశంసింపఁబడుచున్నది.

---

# 3. ఆదర్శజీవి

సుభో బాల్యమునుండియే, ప్రసిద్ధ చిత్రకారుఁ డయి బంగాళపు జమీందారుని యాదరమందిన తన పితామహుని యడుఁగుజాడలలో, సంచరింప మొదలిడినాఁడు. సుభో తండ్రి పేదఁవాడు. అతఁడు బాగుగాఁ జదువుకొన్నవాఁడే. ఐనను నాకాల మటువంటిది. ఆరోజులలోఁ బాండిత్యము నభినందించువారు లేరు. పండితులకుఁ బోషణము లేదు. తూర్పు బంగాళములోని యొక కుగ్రామములోఁ దండ్రి చెంగటనే సుభో కాలము గడుపుచుండెను.

ఆ పల్లెబడికిఁ బోవు టతని కిష్టము కాదుగాని, పోక తప్పలేదు. అతని కా పాఠశాలలోఁ జూడఁదగినదేదైన నున్న దన్నచో నది యతని బల్లకెదురుగా నున్న గోడ. వర్షాకాలములో వెల్లయంతయుఁ గఱఁగి, సున్నపుఁ బూఁతలు మాసినచోట్ల వింతరేఖలతోడి యాకారము లేర్పడి, యతనిలో నేదో యాలోచనలు రేకెత్తించుచుండెను. చదువుకొను వేళలందు గణితము, చరిత్ర మున్నగు నంశములందుండి యతని మనస్సు చిత్రభావములు స్ఫురింపఁజేయు నీ యస్పష్టాకారములందు లగ్నమగుచుండెను. ఒకప్పు డది గణితముచే నింతమేర యనరాని యనంతపథమున విహంగమువలె నెగిరిపోవును.

మఱియొకప్పుడు చరిత్రకందని పుక్కిటి పురాణాలలో మంత్ర తంత్ర గాథలందుఁ బ్రభు కోశాగారమునకుఁ గావలిగా నుండి తుపాకిచేఁబట్టి వేయి కన్నులతో నప్రమత్తుఁడైన వాని

వలె నతివ్యగ్రత వహించును. 'అదిగో భారతదేశ పటము! అదే మన మాతృదేశమూర్తి. పద్మానది యుప్పొంగి పల్లెనుండి పల్లెకుఁ బొలములు ముంచివేయుచుఁ బ్రవహించుచున్నది. బెస్త వాండ్రు గాలములతో హిల్సామత్స్యములకై గాలించు చున్నారు.' ఆ గోడమీఁది రేఖలలో నతని కిటువంటి దృశ్యము లనేకములు స్ఫురించును. 'అది బడి. ఉపాధ్యాయుఁడేదో చెప్పుచున్నాఁ'డని యతఁడు గుర్తింపఁడు.

'సుభో! అను నుపాధ్యాయుని పిలుపు బాంబుప్రేలుడు వలెఁ జెవులఁ బడఁగానే యా మనోహరదృశ్య మదృశ్య మగును. 'అసలు నీవు దేనికిరా బడికివచ్చుట? వచ్చినపుడు నీలక్ష్యము నేనుగాని, యాయెదుటి గోడయఁటరా?' సుభో కామాటలు బోధపడవు. బడి చదువులలో నతని మనస్సు ప్రసరింపదు. అతని తోడిపిల్లలు పలురీతుల నాటపాటలను గుఱించి యేమేమో ముచ్చటించుకొందురు. ఈ పిల్లవాని ప్రకృతియే వేఱు. చెట్లెక్కుట, నదిలో నీదుట, జలక్రీడలలోఁ బోటీలుపడుట యను బాల్యక్రీడ లతనికిఁ గాఁబట్టవు.

ఒకనాఁడు దుర్భరమైన హృదయ భారముతో నతఁ డింటికిఁ దిరిగి వచ్చెను. ఆరేయి నిద్దురయేలేదు. ఒడలు సలసల క్రాఁగుచుండెను. నాడి తీవ్రముగాఁ గొట్టుకొనుచుండెను. మఱునటి యుదయమున కతఁడు మఱింత యస్వస్థుఁడయ్యెను. అనుభవశాలి, వృద్ధుఁడు నగు నా గ్రామవైద్యుఁ డేవో నాటు మందులతోనే జాగరూకతగాఁ గనిపెట్టి యుండుటచే సుభోకుఁ ద్వరగానే వ్యాధి నయమైనది.

అయినను గొన్ని నెలలవఱకు వెనుకటి సత్తువ కలుగ లేదు. పిల్లవాఁడు చాల నీరసించిపోయెను. 'వీఁడు విశ్రాంతి తీసికొనవలెను. కొన్నాళ్ళవఱకు బడికిఁ బంపవ'ద్దని వైద్యుఁడు గట్టిగాఁ జెప్పెను. సుభో మనస్సు తేలికపడెను. స్వేచ్ఛగా నుండుటకంటె మనస్సునకుఁ బ్రియమైనది యేమున్నది? దాని తోనే సగ మస్వస్థత నశించును. 'సంతోషము సగము బల' మనుటలో నెంత యర్థమున్నది! విశ్రాంతి యనఁగా నిఱువది నాలుగు గంటలు మంచాన కంటిపెట్టుకొని యుండుట కాదు. విధి నిషేధముల ప్రసక్తి లేకుండఁ దోఁచిన పని చేయుట, ప్రకృతిలోని సుందరదృశ్యముల నవలోకించి యానందించు చుండుట, స్వేచ్ఛావాయువులు పీల్చుట. సుభోకుఁ గొండంత బరువు తగ్గినట్లైనది. రకరకాల బొమ్మలు గీయుట, వానికి రంగులువేయుట యతనికి నిత్యకృత్య మయ్యెను. అది వట్టి కాలక్షేపమునకే కాదు. ఆ కళలోఁ దాను నిష్ణాతుఁడు కావలెను. 'అనురక్తియున్న కార్యములోఁ బాల్గొనఁ గలుగుట కంటె విశ్రాంతిలే' దను భావ మాతనికిఁ గలిగినది.

కాని, పాపము! చిత్రలేఖనమున కనువైన కాగితము కాని, తూలికకాని, రంగులుకాని యతనికి లభింపలేదు. సుభో తండ్రి కడుబీదవాఁడు. చిత్రకారుఁడైన తన కుమారునికిఁ దన దృష్టిలో ధనికులకే వలసినవిగాఁ గనఁబడు నీ వస్తువు లతఁడు సంపాదింపలేదు. యథార్థమున కవి యెంతో యావశ్యకములే కాని, ధనికులు మాత్రమే కోరఁదగిన భోగ్యవస్తువులు కావు.

'ఆవశ్యకత సంసిద్ధికిఁ దల్లి' యను నార్యోక్తి యున్నది. సుభో మనస్సు కలలతోఁ దేలిపోవుచుండెను. అతని పరిసరము

లందలి సుందర చిత్రములు నందలి రేఖలమలుపులు నతని మనస్సు చూఱగొన్నవి. వానినిఁ జిత్రింపవలెనను నాతురత మెండయ్యెను. ఆతని యంగుళులు విచిత్రముగా నాయా రూపములఁ జిత్రించుటకై పెనఁగులాడి యలసి పోయెను. "మబ్బులు! మహీజములు! పిట్టలు! గుట్టలు! ఆహా! ఈశ్వరుఁ డెంత గొప్ప చిత్రకారుఁడు! అతఁడెట్టి వింతరూపములు పోతపోసినాఁడు! అతని హస్త మెంత నిపుణము!" అని యాతఁ డుప్పొంగిపోయెను.

ప్రకృతిలోని నానావర్ణములు పరీక్షించి చూచెను. ఏరంగున కారంగే యందమైనది. ఆ రంగులు, నా ప్రకృతి యతని ని ట్లాహ్వానించుచున్నట్లు తోఁచెను.

"కదలిరా! సౌందర్య ఖనిని నేనోయి!
చవిఁజూడు మిటువచ్చి సకల మీశోభ;
యాత్మోపభోగ్యమౌనది యిదేసుమ్మి!
కాల మేఁటికి వృథా గడపఁ గోరెదవు?"

వర్ణము లన్నిటియందు శోణవర్ణ మతనికిఁ బ్రియమైనది. చిలుక నాసిక మెఱుపు, పక్వమైన ఫలముయొక్క యరుణిమ, యగ్నిజ్వాలల రక్తచ్ఛాయ యిట్లా యారీతులనున్న యా మెఱుపురం గతని నక్షరాల నున్మత్తునిఁ జేసినది. "శోణవర్ణమే జీవిత చ్ఛాయ. అందే కళయున్నది. కాబట్టి యరుణిమయే కళాద్యోతకము." ఈ సిద్ధాంతము జీవించి యుండఁగా నెవ్వని కిని బోధపడదు. అయినను నేనాఁటికో యొకనాఁటికి బహుశః అతఁడు తమవుఁ జాలించిన పిమ్మటికైన ననుభవమునకు రాక పోదు.

పలపలని బురద, యెండు మట్టి, యెండు కాయలు, పచ్చికాయలు మొదలయినవాని సమ్మేళనముతో నతఁడు రక రకముల రంగులు, పసుపు, ఆకుపసుపు, అతినీలము, నీలము మున్నగువానినిఁ గల్పించెను. అయినను నతనికి సంతృప్తికర మైన యరుణిమను మాత్రము సృష్టింపలేకపోయెను. 'పల్లె పిల్లల యంఘ్రుల యెఱ్ఱఁదన మెంత మనోహరము ! అయి నను దానికంటెను విశిష్టమైన యరుణిమయే నాకుఁ గావలసిన' దని యతఁ డనుకొనెడివాఁడు.

చూడ ముచ్చట గొల్పునవి కొన్ని, విలక్షణత యుట్టి పడునవి కొన్నిగా ననేక చిత్రములను వ్రాసి, యసాధారణ వర్ణములతో వానికి మెఱుఁగు వెట్టినాఁడు. మృదుశిలలు, వృక్షస్కంధములు, నతని చిత్రములకుఁ బత్త్రములు. కొన దేలిన శిలాఖండమే తూలిక. దానితోనే వివిధ భావస్ఫోర కములైన తెల్లని రేఖావళులు సృజింపఁబడినవి. ఎందైననొక కాగితపు ముక్క దొఱికినచోఁ గనకముగా భద్రపఱుచుకొని, దానిపైఁ జక్కని బొమ్మ వ్రాయుటయుఁ గలదు.

ఇట్లు కొన్నినెలలు గడచినవి. దుర్గా పూజాదినములు దగ్గఱలోఁ బడినవి. వెనుకటికంటెఁ దన యారోగ్య మెంతో చక్కగా నున్నట్లతనికిఁ దోఁచినది. తనలో నొక నూతన బల ముద్భవిల్లినట్లు భావ మేర్పడినది. ఈ స్థితిలో నతని తండ్రి మరణించినాడు. సుభోకీ సంఘటనతో లోకమున 'నా' యన్నది లేకపోయినది. అయినను దన కాస్తి లేకపోయిన దను దిగు లతని కెంతమాత్రమును లేదు. తన్నుఁ బరామర్శింప వచ్చినవారితో నతఁ డిట్లనెను. "తండ్రి నా కేమియు ధనము



మృదుశిలలు, వృక్షస్కంధములు, నతని చిత్రములకుఁ బత్రములు

ముట్టఁజెప్పలేదే యను విచారము నాకులేదు. ఆయన ధనము కంటెను విలువగల భావనను నా కొసఁగినాఁడు." ఎంతో చిత్త శుద్ధితో నతఁడు పలికిన యీ పలుకులకుఁ బరిచితులు, విరుగు పొరుగువారు పకపక నవ్విరి. "భావన! కాని నీవు భావన చేతనే బ్రతుకలేవు సుమా! ఇవి యెటువంటి గడ్డురోజులు! వస్తువుల ధరలు కొండ యెక్కినవి; జీవితమే దుర్భరముగా నున్నదిగదా!"

ఒకనాఁడొక బిక్షుకుఁడు సుభో యొద్దకు వచ్చెను. తన తర్జనికి బిగించిన యొక యుంగరముతోఁ దంబుర మీటుచు నతఁ డిట్లు పాడెను.



"ఏ నగరమునకో, పోవోయీ!
ఏ పురమునకో, పోవోయీ!
తారావీథికి ధర లెగఁబ్రాకుట
పాతాళమునకుఁ బ్రజలు క్రుంగుట
చూచెదవయ్యా! చూచెదవు."

భావజగత్తులో మాత్రమే విహరింప నేర్చి, వాస్తవ ప్రపంచములోని కాఠిన్యముఁ గాంచి యెఱుఁగని సుభో కా పాటవలన నెట్టి యాలోచనయును గలుగలేదు.

జీవికకై, తాత్కాలికముగ నమ్మెడువోవు దుర్గా విగ్ర హములను నిర్మించుట కతఁడు సమకట్టెను. ఆ చిత్రములలో నుపయోగించు వర్ణముల విషయమై యొక క్రొత్త యూహ తోఁచెను. అయినను దన యభిప్రాయము వెల్లడించుటకు సాహసింపలేదు. ఏలయనఁగా నప్పటి శిల్పులందఱు పురాతన

సంప్రదాయములే పరమపవిత్రము లను విశ్వాసముతో నవి తు. చ. తప్పకుండఁ బాటించుచుండిరి.

ఒకనాఁడు కలకత్తాలోని కళానికేతనమునఁ బ్రధానా ధ్యాపకుఁడైన నక్షిబాబు సుభో నివసించు పల్లెకు వచ్చెను. అది యాయన జన్మస్థలమై యుండుటచే నా యూరివా రంద ఱాయనకుఁ బరిచితులై యుండిరి. సుభోను గుఱించి యెవరో యాయనకుఁ జెప్పిరి. ఆ చెప్పినవా రాతని కళా నైపుణ్యము కంటె నతని యభిరుచులను విశేషముగా వర్ణించిరి. నక్షిబాబు వెంటనే సుభోను గలసికొని, యతని చిత్రముల నేవైనఁ జూపుమని యడుగఁగా నతఁడును గాదనలేకపోయెను; గాని చాల సిగ్గుపడుచు నెట్లో తానప్పుడప్పుడు వీథిలో దొఱికిన కాగితపు ముక్కలపై గీచిన బొమ్మలను జూపెను. 'నీ వ్రేళ్ళలో నొక నూత్నసృష్టి యున్న' దని నక్షిబా బతని నగ్గించెను. సుభో ప్రశాంతముగా నిట్లనెను. 'ఆ నూత్నసృష్టి నా హృదయములో నున్నదేకాని వ్రేళ్ళలో లేదు.' అచిరకాలముననే నక్షిబాబు కళానికేతనములోఁ జేరుటకు, సుభో యతని ననుసరించుట నిశ్చితమయినది.

ఆ పాఠశాలలోఁ ద్వరగానే సుభోపేరు పైకి వచ్చినది. అతని యభ్యాసము లెంతో స్పృహణీయములుగా నుండెను. వెళ్ళినచోటనెల్ల నతని కొక విశిష్టగౌరవము గలుగుచుండెను. చిరకాలమునుండి కన్న కల లిప్పుడు సత్యములైనవి. చిత్రకళ కావశ్యకము లనుకొన్న పెన్సిళ్ళు, రంగులు, తూలికలు లభించి నవి. వింద్సరు, న్యూటను రంగులపెట్టెలే నిత్యోపయోగ్యము

లైనవి. సుభో కావశ్యకమైన దేదియుఁ గొఱవడకుండునట్లు సఖిబాబు శ్రద్ధతీసికొనెను.

అదేమి చిత్రమో! సుభో కా నవీన పరికరములు, నవీన మార్గములు కొలఁది కాలమునకే విసుగు పుట్టించెను. ఆ నవీన మార్గమున నతని కేదో లోప మున్నట్లు స్ఫురించెను. అంతే కాదు. తన సహజ ప్రతిభ కంతరాయ మేర్పడిన దనిపించెను.

సఖిబాబు వివేకి, పరేంగితజ్ఞుఁడు. సుభోవంటి ప్రతిభా శాలి యీ పాఠశాలా ప్రణాళికలకుఁ గట్టువడి యుండఁజాలఁ డని గ్రహించెను. ఎట్టి ప్రతిబంధకములు లేని యొక ప్రత్యేక ప్రదేశమున నవసర వస్తుసామగ్రి సమకూర్చి సుభో కచట నివాస మేర్పరచెను.

సుభో నిర్విరామముగాఁ గృషిసేయ నారంభించెను. అద్భుతములైన చిత్రములను వ్రాసెను. అవి చూపఱ నెంతో యాకర్షించుచుండెను. కళాప్రియు లనేకు లతిప్రీతితో నతని జూడ వచ్చుచుండిరి. కాని యంతకంతకు వారి రాకలు మెండగుటచే, సుభో కార్యదీక్షకు భంగము కలుగుచుండెను. తలుపులు మూసికొనికాని చిత్రలేఖన మారంభింపరాదని నిశ్చయించుకొనెను. ద్వారమునకు వెలుపల 'అంతరాయము గలిగింపకుఁడు' అను వాక్యము వ్రాయఁబడిన యొక కాగితము నంటించెను. ఆ పనివలన నతని కెంతో తృప్తి కలిగినది. అయినను నావ్రాఁత చూచినప్రజల కది మోటుఁదనము, నవినయముగాఁ గనిపించెను.

అయినను నా మూయఁబడిన తలుపు లతని ప్రతిష్ఠను మూసివేయలేదు. అది దినదినాభివృద్ధియైనది. కళాప్రియులు, విమర్శకులు సుభో వర్ణచిత్రములను, ప్రధానముగా నతఁ డుప యోగించిన శోణవర్ణవికాసముఁ గాంచి యబ్బురపడిరి. ఏ యితర చిత్రకారుని వర్ణచిత్రమునను నా విశిష్ట వర్ణము కానరాకపోయెను. అదియొక యపూర్వ సృష్టి. క్రిమ్సన్‌లేక్, స్కార్లెట్, వెర్మిలన్, భారతీయ శోణవర్ణము ననునవిమాత్రమే యప్పటికి వాడుకలో నున్న యరుణ వర్ణభేదములు. సుభో యుపయోగించినది యీ యన్నింటికంటె భిన్నమైనది.

ఇట్లుండఁగా, అఖిలభారత వర్ణచిత్ర ప్రదర్శనము కలకత్తాలోని ఈడెను ఉద్యానవనమందు జరుపుటకు సన్నాహము లొనర్పఁబడినవి. దేశమందలి యన్ని భాగములనుండి సామాన్యులు, నుత్తములు నగు నిఱుతెగల చిత్రకారులును దమ వ్రాసిన పటము లాప్రదర్శనమునకుఁ బంపుచుండిరి. ఒకనాఁటి యుదయమున సఖిబాబు సుభోను జూడవచ్చి 'సుభో! నీ దీక్ష కంతరాయము గల్గింపవలసినందులకు విచారపడు చున్నాను. కాని యిచట జరుగనున్న ప్రదర్శనమున కొక ప్రత్యేక వర్ణచిత్రము నీవు లిఖింపవలెనని చెప్పుట తప్పనిసరియైనది. అందలి యుత్తమ వర్ణచిత్రమున కొక గొప్ప బహుమతి నిచ్చుట కొక కోటీశ్వరుఁడు నిశ్చయించినాఁడు. ఆ బహుమతి నీవు గెలుచు కొనఁగలవని నాకేదో యజ్ఞాతశక్తి చెప్పుచున్నది' యనెను.

ఇట్లని యా చిత్రకారునిఁ బరీక్షగాఁ జూచి విస్మితుఁడై 'ఏమిది ? నినుఁజూచిన భయమగుచున్నది. ఇంత నీరసించితి

వేమి ? ఒడలిలో రక్తమే లేన ట్లున్నది ! ఏమిటి సుభో ? ఏమి జరిగినది ? ఎన్నాళ్ళనుండియో లంకణములు చేసినట్లు కనఁబడుచున్నావే' మని ప్రశ్నించెను. సుభో వింతగా నవ్వి యిట్లనెను. 'అయ్యా ! నేను నీరసించియే యుండవచ్చును. కాని ప్రజలకు నా చిత్రములు వికాసవంతములు, సజీవములుగాఁ గనఁబడుటలేదా ?'

దినదినమునకు సుభో మొగము పాలిపోఁజొచ్చెను. అయినను నతఁడు తన కృషినుండి విరమింపలేదు. యథార్థ కళోపాసి కాలమెన్నఁడు వ్యర్థము సేయఁడు. కాలమే యతనిని గోల్పోవుచుండుట యనుభవసిద్ధము.

చిత్రము పూర్తియైనది. అది ప్రదర్శనమున సమర్పఁబడినది. ప్రజలందఱి దృష్టులును దాని మీఁదనే నిలిచినవి. కళాప్రియులు, విమర్శకులు దానిముందు ముగ్ధులై నిలిచిరి. "పద్మానదిపై సూర్యాస్తమయము" అని యా చిత్రము శీర్షిక. ఏమా సాయంసంధ్య ! అది కేవల మీశ్వర సృష్టివలె నున్నది; కాని, మానవమాత్రుఁడైన యొక బాల చిత్రకారుని సృష్టివలె లేదు.

బహూకరణ ద్రవ్యము సుభోకుఁ బంపఁబడినది. కాని, సుభో యా ప్రదర్శనశాలలో నే సమయమందును గనఁబడలేదు.

పిన్నలు, పెద్దలు, సామాన్యులు, లబ్ధప్రతిష్ఠులు నగు చిత్రకారు లందఱు సఖిబాబు వెంట సుభో సందర్శనార్థులై వచ్చిరి. సఖిబాబు సంతోషమున కంతులేదు. తనచేఁ బ్రోత్స

హింపఁబడిన యొక పల్లెటూరి పిల్లవాఁ డింతవాఁ డైనాఁడను గర్వమును గలిగెను. అందఱును సుభో నివాసగృహము బయ టనే నిలిచియుండవలసి వచ్చెను. తలుపులు లోపల గడియచే బంధింపఁబడి యుండెను. ఇందఱును సుభో నభినందింప సఖిబా ఓక్లెను. 'ఆహా! ఇఁక సుభో నిశ్చింతగాఁ గాలము గడపఁ గలఁడు. అతని కల లన్నియు ఫలింపఁ జేసికొనుటకుఁ జాలి నంత యవకాశ మేర్పడినది. ఇప్పుడుగదా నాకు సంతోషము!'

ఆ జనసమూహ మిట్లు హర్షముతో ఘోషించెను. 'సుభో! నీ కొక చక్కని వార్త వినిపింతుము. తలుపు దీయుము.' కాని లోపలినుండి సమాధానము లేదు. అప్పుడు బలిష్ఠుఁడు, సమున్నతుఁడు నగు నొక చిత్రకారుఁ 'డిందేమో మోసమున్నది. తలుపులు బ్రద్దలుచేయుద' మని బలముకొలఁ దియుఁ దన్నఁగాఁ దలుపులు విడివడినవి.

లోనికిఁ బ్రవేశింపఁగానే నేలఁబడియున్న సుభో శవము వారికిఁ గాన్పించెను. అతని కుడి యఱచేయి యేదో రహ స్యము కప్పిపెట్టుచున్నట్లు హృదయమున కంటియుండెను. శవము ఱొమ్ముమీఁది వస్త్రము తొలగింపఁగానే యట నొక గాయము కనఁబడినది. అది యొక దివ్యసూక్తి వెలువరించు గురుదేవుని వదనమువలె భాసించెను. అందుండి యొక సందేశ మిట్లు వెలువడిన ట్లుండెను. "ఉత్తమ చిత్రకారుఁడు వర్ణ చిత్రము లిఖించు విధాన మిదే! ఆ వర్ణద్రవ్యము హృదయ రక్తము! ఆ వర్ణద్రవ్యము హృదయరక్తము!"



సుభో యూహాయే సత్యము. "శోణవర్ణమే జీవిత చ్ఛాయ. అందే కళ యున్నది. కాఁబట్టి యరుణిమయే కళా ద్యోతకము."

సుభో బ్రతికియుండఁగా నీ సత్యము గుర్తించినవారు లేరు. అతఁడు మరణించిన పిమ్మట నంద అది గుర్తించిరి.

---

# 4. జంబుకాచార్యుఁడు

ఒక వంచకము తనజాతిలో నన్నిటికంటెఁ గడు జిత్తుల మారియై ప్రసిద్ధి గన్నది.

దానికి జీవినోపాధి లేకుండుటచే నేమియుఁదోఁచలేదు. జీవించుటకు హక్కులేదా ? ఉన్నది. కాని దానికొక నియమ మున్నది. ఎంతో కష్టించినఁగాని బ్రతుకుఁదెరువు లేదు. అది జీవు లందఱికి నున్న సమస్యయే కదా !

ఆలోచించి యాలోచించి, దాని మేధస్సు పగిలిపోయి నది. రాత్రుల నిదురలేదు; పగళ్ళయందు శ్రమ తప్పదు. సము చిత జీవనోపాధి మాత్రము కనఁబడ లేదు.

కొన్నాళ్ళ కొకరాత్రి సుఖముగా నిద్రించి మేల్కాను నప్పటికా సూర్యోదయము దానిజీవితములో నవోదయముగాఁ దోఁచినది. ఒక బడిపంతులుగా నున్నచోఁ దాను రాణింపఁ గల ననుకొన్నది. వనమృగము లన్నియుఁ దన తెలివి తేటల కచ్చెరువడుచుండుట ప్రత్యక్షమేకదా! ఇఁక నందుఁ దానొక పాఠశాల నేర్పఱచుట కభ్యంతర మేముండును ?

అది యట్లుండగా, నా యరణ్యమున కేలికయైన మృగ రాజు; తన ప్రభుత్వము సక్రమముగా సాగుటలేదని, విచారిం చుచున్నట్లు తెలియవచ్చెను. ఆ మృగరాజునకు గుమాస్తా లింకను గావలయునఁట! బాధ్యతాయుతముగాఁ బ్రతి చిన్న పనియు నెఱవేర్చువా రున్నఁగాని తదితరములైన యవసర ప్రభుత్వకార్యము లమలు జరుగవని యా సింహ మాలోచించు

చుండెనఁట! ప్రభుత్వపు టవసరములు దీర్పదగిన యుద్యోగులను దీర్చిదిద్దఁగల యొక పాఠశాల స్థాపించుట కిది యవకాశము కాదా?

ఆ పని ప్రారంభించుటకు దాని కెంతోకాల మక్కఱ లేకపోయెను.

విద్యార్థులు లేని పాఠశాల పాఠశాలకాదని జంబుకము గ్రహించి తన్ను గుఱించియుఁ దాను నెలకొల్పఁబోవు పాఠశాలను గుఱించియుఁ దిరిగినచోటనెల్లఁ బ్రచార మారంభించెను. 'స్వయంప్రచారము లేనిదే యీ దినములలో నెవఁడును రాణింపఁడు' అని యది తలపోసెను.

'సా. వి. సం.' అను నక్షరము లెఱ్ఱసిరాతో వ్రాయఁబడి యున్న యొక పతకము తన యంగీ జేబునకు మీఁద గ్రుచ్చి కొని సృగాలము చూపఱ నాకర్షించెను. 'ఆ పతక మేమి? దానిమీఁది యక్షరము లేమి సూచించును?' అను తర్జనభర్జనలకు లోనైన యెదుటివారి కిట్లు చెప్ప నారంభించినది. 'సా యనఁగా సామ్రాజ్యము; వి యనఁగా విద్య; సం అనఁగా సంస్థ. మొత్తము మీఁద నీ పతకము సామ్రాజ్య విద్యా సంస్థ (Imperial Educational Institute)ను సూచించును.' ఈప్రచారము త్వరలోనే నలుదెసలకుఁ బ్రాకినది. సామ్రాజ్య విద్యా సంస్థ పే రన్నియెడలఁ బ్రతిధ్వను లీనినది.

మొట్టమొదట నీపేరు తృణకీటకముల చెవులఁ బడినది. పిమ్మట నంతకంటెఁ బ్రసిద్ధిలో నున్న యితర కీటకములకుఁ దెలియ వచ్చినది. క్రమక్రమముగా ఆకుపురుగులు, గొల్లభామలు, వృశ్చికములు, తేనెటీఁగలు, వడ్రింగి పిట్టలు.




సామ్రాజ్య విద్యా సంస్థ

మండూకములు, సర్పములు, బకములు నివి యవి యననేల? సకల ప్రాణులు నా సామ్రాజ్య విద్యాసంస్థయొక్క ప్రశస్తి విన్నవి. దీర్ఘ పాదము లయిన సాలె పురుగులును విన్నవి; కాని యేమాత్రము దానిని గుఱించి యుద్వేగ పడలేదు.

నేలమీఁదఁ బ్రాకునవి, దుముకునవి, మందగమనము గలవి, శీఘ్రగమనము గలవి యగు నానా ప్రాణులు చేరుటతోఁ, బాఠశాల, మూల్గులతో, రొదలతో, నఱపులతో బహువిధ నినాదములతో నెంతో సందడిగా నుండఁజొచ్చెను. 'భగవత్కృపచేత నిన్నాళ్ళకు మన పుత్త్రిలు, మనుమలు విద్యావంతు లగుట కొాక చక్కని యవకాశము కలిగినది. విద్య మహోజ్జ్వలమైనది' యని సంతోష పరవశములై జంతువు లన్నియుఁ దమ సంతానము నా పాఠశాలకుఁ బంపఁ దొడఁగినవి.

సామ్రాజ్య విద్యాసంస్థ చక్కగా సాగిపోవుచుండెను. వంచకమున కిప్పు డొక నూతన నామకరణము జరిగెను. అది యేమనఁగా 'జంబుకాచార్యుఁడు.' జంబుకాచార్యుఁ డనతి కాలమందే తన కొలువులో గుమాస్తాల ననేకుల నియమింప నాతురపడు మృగరాజు నభిమతమునకుఁ దగినట్లు విద్యార్థులను దీర్చిదిద్దు బోధనా విధానముచే సుప్రసిద్ధుఁడై నాఁడు. వనమునకుఁ జేరువఁ గల నదిలోని క్రకచము జంబుకాచార్యుని ప్రసిద్ధి విని యాశ్చర్యపడినది. సామ్రాజ్య విద్యాసంస్థను గుఱించి యెంతో ముచ్చట పడినది. దాని కేడుగురు బిడ్డలు. భార్య గతించి చాలకాలమైనది. పిల్ల లింతవాం డ్రంతవా రైనారు. వాండ్ర వయస్సుతోఁబాటు సోమరితనమును బెరుఁగుచుండెను.

క్రకచ మప్పుడు తన బిడ్డలతో నిట్లన్నది. సోమరితనము మహాదోషము. ఇఁక మీ రెంతమాత్రము కాలము వ్యర్థము చేయరాదు. మిమ్ముల నేడుగురను నేను జంబుకాచార్యుని పాఠశాలలోఁ జేర్తును.'

ఏలాగైన నేమి? అడవియందలి ప్రాణు లన్నియు విద్యా సంపాదనమునకుఁ దహతహ లాడినవి. వృద్ధ క్రకచము తనపిల్లల నిఁక నింటిలో నుండనీయఁ దగ దనుకొన్నది. ఎప్పటికైన నా కొంటె పీతలు, వెకలి కప్పలు, మొద్దు లొద్దుగలు నీ క్రకచశిశువులను జూచి యిట్లు గేలి చేయును. 'ఆహాహా! మొసలిపిల్ల లవిగో! వానికిఁ జదువురాదు; వ్రాతఁ జేతఁగాదు; లెక్క లసలే సున్న. ఒక్క పద్య మొప్పగింప లేవు."

ఒకనాఁ డది జంబుకాచార్యుఁ డింటనున్న సమయమున నచ్చటికిఁ బోయి యిట్లు సంభాషించినది. "ఆచార్య వంచకా! నాదొక మాట యున్నది."

"ఒకటేమి? పది చెప్పవచ్చును. మఱి యవసరమైనచో నిరువది చెప్పుడు. మకరశిరోమణీ! బుద్ధిమదగ్రేసరులైన మీ కభ్యంతరముఁ జెప్పుదునా?"



"సుప్రసిద్ధమైన తమ సామ్రాజ్య విద్యాసంస్థలో నాపిల్లల నేడురినిఁ బ్రవేశపెట్టఁ గోరెదను........"

అర్థోక్తిలోనే జంబుకాచార్యుఁడు స్పష్టాస్పష్టమైన యొక మందహాసముచేసి యిట్లనెను. "క్రకచరత్నమా! నాజీవితములో నిది యొక మహోజ్జ్వలదిన మని భావించుచున్నాను. మీపిల్లలు నా శిష్యులగుట నిశ్చయముగా నాకు గర్వహేతువు. మంచిది. ఈశ్వరుఁడు వారి ననుగ్రహించుఁగాక!"

"తామేదో నవీనమార్గమునఁ జదువు చెప్పుదు రని వింటిని."

"అయ్యా! నాకు బురాతన మార్గములు నచ్చవు."

"నా బిడ్డల ప్రతిభావిశేషము మీ మెప్పునకు రాఁగల దనుకొందును."

"అందుకు సందేహమా? నిజముగా వారెంతో బుద్ధిమంతులు. విద్యావాసన చూడకున్నను వారిలో జ్ఞాననేత్ర మున్నది. ఒక వారము దినములలోనే నేను వారిపని ముగింపఁగల ననుకొందును."

"ఒక్క వారములోనా? అసంభవమేమో?"

"ఏకార్యమందైన నే నాలస్యము సహింపను. వేగముగనే నే నుజ్జ్వల ఫలితము సాధింతును."

"ఇంకేమి? ఈ వారము గడవఁగనే పిల్లలను దీసికొని పోవుటకు వచ్చెదను."

"అట్లేరండు స్వామీ!"

"ఇంక సెలవా?"

"మహాప్రసాదము."

సంతోషముతో మొసలి యొంటరిగా నింటికిఁ దిరిగి పోయెను మృగరాజు రాజనీతి కనుగుణముగా జంబుకాచా

ర్యుఁడు పాఠశాలలో విద్యాబోధనముఁ గొనసాగించెను. దిన మున కొకటిగాఁ బ్రాతఃకాలమున మకరశిశువుల నారగించు చుండెను. ఇట్లాఱు దినములు గడచెను. ఒక మొసలిపిల్ల మిగిలి పోయెను. చల్లఁగా నింటిపట్టునఁ గూర్చున్న వృద్ధమకరము తనబిడ్డ లీనాఁటి కెంతో తెలివి సంపాదించి యుందురని సుఖ స్వప్నములు కనుచుండెను. మొసలి బిడ్డలా నరకమునఁ బ్రవే శించిన పిమ్మట నేడవనాఁడు మఱలఁ బ్రొద్దు పొడిచెను.

ముసలి మొసలి యా సమయమునఁ దనలో నిట్లను కొన్నది. "ఒక్కమాఱు పాఠశాలకుఁ బోయి జంబుకాచార్యు లతోఁ బ్రసంగింపవలెను. బిడ్డ లిన్నాళ్ళుగా నేమి నేర్చిరో చూడవలెను. బహుశః నేటితో వారి పని ముగియ వచ్చును."

జంబుకాచార్యుఁడు తన వివరమందుఁ గూర్చుండి యేమో యాలోచించుచుండఁగా నెట్టయెదురుగాఁ బ్రకచము కాన్పించెను. ఆచార్యుని గుండె జల్లుమన్నది. మొసలి సంతోషపూర్వకముగా నెలవులువాఱ నవ్వినదేగాని, యది నవ్వినప్పుడు కఱకుఱంపపు ముండ్లవలెఁ బయటఁబడిన పలు వరుస యయ్యవారికి దడపుట్టించినది. అయినను మనసు నిబ్బ రించుకొని, జంబుకాచార్యుఁడు ముమ్మారు సాగిలపడి మ్రొక్కి, మకరవృద్ధమును మెప్పింపఁగలిగినాఁడు. పిమ్మట లోని కించుక తొంగిచూచి యొక గొల్లభామను బిలిచి, యతిథి కింత పాగాకును, వస్త్రమును దెమ్మని చెప్పి, క్షణములో దెప్పించి యతిథికి సమర్పించినాఁడు. 'క్రకచ వంశపయఃపారా వార సుధానిధీ! ఇంచుక విశ్రమింపుఁడు. ఇంతలోఁ దమ బిడ్డ

ళను రప్పింతు' నని సవినయముగాఁ బలికి మొసలినిఁ గొండ
కెక్కించినాఁడు.

ఆ స్వాగత మర్యాదలకు వెఱ్ఱిమకర ముబ్బి తబ్బిబ్బై
యిట్లనుకొన్నది. "జంబుకములకు లోకములో నప్రతిష్ఠ యెట్లు
కలిగెనో; నా కర్థము కాకున్నదే! ఒకవేళ సహజముగా నవి
జిత్తులమారులే కావచ్చును. కాని, యీ లోక ప్రవాదమునకు
విరుద్ధముగానున్నదీ గోమాయువు. ఇట్టి పవిత్రప్రాణి మఱియొ
కటి లేదనుకొందును."

అంతలో 'క్షణకాలము నాకు సెలవిప్పింపుఁ' డనుచు
జంబుకాచార్యుఁ డతి వినయముగాఁ గ్రకచము నర్థించి, వీడ్కొని
లోనికి వచ్చినాఁడు. హతశేష శిశుమకరమును బిలిచి 'నీతండ్రిని
సప్తవారములు సందర్శించిర'మ్మన్నాఁడు. ఆ యమాయిక శిశువు
గుర్వాజ్ఞ యథావిధిగా నిర్వర్తించినది. ముసలి మొసలి యీ
మోసమెఱుఁగక యేడుగురు బిడ్డలు నేమముగా నున్నారని
సంతృప్తిపడినది. అంతలో జంబుకాచార్యుఁ డీవలికి వచ్చి యిట్లు
సంభాషణ మారంభించినాఁడు. 'నే నొక చిన్న పొరపాటు చేసి
తిని. మొసలిపిల్లలు నీట నీదునంత సులభముగా విద్యాసముద్రము
నీదవచ్చు ననుకొంటిని. అయినను నంతమాత్రముచే వచ్చిన
హానిలేదు! మీబిడ్డ లచిరకాలముననే మహాపండితు లగుట మీరు
చూడఁగలరు."

మకర మా మాటల కెంతో సంతోషించెను. ఒక రోజు
కానీ! రెండురోజులు కానీ! మఱియు 'మించినచో-రెండు వారాలు

కానీ! ఇంతలోఁ బోయినదేమి? కాలమును గుఱించి యాలోచన దేనికి! ఎప్పటికైనఁ దన బిడ్డలు చదువు ముగింతురు.

చదువే వారిని ముగింపఁగల దన్న తలంపా మతిహీన క్రకచవృద్ధము హృదయములో నుదయింపనేలేదు.

వనరాజగు హర్యక్షమున కామోదకరమైన యా సామ్రాజ్య విద్యాసంస్థ రెండు శతాబ్దము లనన్య సామాన్యముగాఁ బ్రకాశించినది.

---

# 5. రాజా రామమోహనరాయలు

వంగదేశమాత బిడ్డలలో మహనీయు లగు వారి యందు రాజా రామమోహనరాయ లొకఁడు. అతని తల్లి దండ్రులు పూర్తిగాఁ బూర్వాచార పరాయణులు. తమ యింట నెలకొల్పఁ బడిన దేవతా విగ్రహమునకు సమర్చలు సేయుటతోనే కల కాలముఁ గడపిరి. రామమోహనుఁ డగ్రశాఖకుఁ జెందిన బ్రాహ్మణుఁడు; కనుక బాల్యమునుండియు, విగ్రహారాధనకు సంబంధించిన సనాతనాచార వాసనలలోనే పెరిగినాఁడు.

నాఁటి యాచారము ననుసరించి చిన్నతనమందే పన్నెం డేండ్ల పసిపిల్లతో నతనికి వివాహము జరిగినది. కాని, యా పిల్ల స్వల్పకాలమునకే మరణించినది. అతని యభిప్రాయమునకు విరుద్ధముగా మఱి యిర్వురు బాలికల నతఁడు చేపట్టవలసి వచ్చెను. అతఁడు చాల మాతాపితృభక్తి గలవాఁ డగుటచేఁ దల్లిదండ్రుల కెదురు చెప్పలేకపోయెను. పరిస్థితులను సృజించి కొనఁజాలు దిట్టగా, నుత్తమమైన యౌవనము నేకాంతప్రదే శమునఁ గడపుచుఁ దన మనమున కుచితములుగాఁ గనఁబడని పరిస్థితుల నెదుర్కొనఁ దలఁచెను. కొంతకాల మాలస్యమే యైనను సంపూర్ణముగా నానాఁడు ప్రాముఖ్యము వహించిన యాచారములపై నతఁ డొక విప్లవ మారంభించెను. ఈ వ్యవ ధిలో హైందవమతమున నొక నూత్న సంప్రదాయమునకై పునాదులు వేయఁజొచ్చెను.

ఈ సమయమునందుఁ దల్లిదండ్రులు పాట్నాలోఁ జదువు కొనుమని పంపిరి. ఆ పాఠశాలయందలి యుపాధ్యాయులును, విద్యార్థులును నతనిలో నొక వైశిష్ట్య మున్నదని గుర్తించిరి. అతని నిశిత పరిశీలనము, స్వేచ్ఛాప్రియత్వము, సముత్సాహముఁ బ్రతివారి నాకర్షించెను. మనస్సు వికసించిన కొలఁదియు నిర్బంధ మన్న ప్రతిదానిని నతఁ డసహ్యించుకొనఁ జొచ్చెను. మనస్సును, నుత్సాహమును నరికట్టు నిర్బంధము లన్నిటికంటె నధమాధమము లని యతని భావము. అతఁడు సత్యాన్వేషి. తనకుఁ దానై విమర్శించుకొని తృప్తిపడినఁగాని యే విషయమును నతఁ డామోదింపఁడు.

పాట్నానుండి యింటికి మఱలి వచ్చినప్పటి కతని హృదయము నవభావములతో, మహోద్వేగముతోఁ బ్రదుళ్ళి పడుచుండెను. ఆ నవీనతవలన మిత్రులు దూరమగుటయు, నాప్తబంధువులే యసహ్యించుకొనుటయును సంభావ్యము లయ్యెను. అతఁడు విగ్రహారాధనమును సమూలముగా ఖండించెను. ప్రజల నపమార్గమున కీడ్చునది, యవివేక మూలకమైనది విగ్రహారాధన మని యుద్ఘాటించెను. అతని జననీజనకులిది చూచి యతని నిర్మల ప్రవృత్తిఁ దెలిసికొనలేక విగ్రహారాధనమును సమర్థించుచు నెంతో వాదించిరి. విగ్రహము దివ్యకళా చిహ్నమని, మానవుల విశ్వాసముచే దానియందుఁ బ్రాణప్రతిష్ఠ జరుగునని, యేమేమో చెప్పిరి.

హేతువాదయుగమునఁ బుట్టి, నవనవప్రతిభాధిక్యముచే భారతీయ మేధావులలో నొక విశిష్టతగల రామమోహనుఁడు శాస్త్రవిజ్ఞానదూరము లయిన యీ పలుకులు మెచ్చఁ

డమ్యెను. మఱికొంచెము పెద్దవాఁ డగునప్పటి। కతఁ డీ విష యమై బహుళ ప్రచార మారంభించెను. ఇందువలన నతనినిఁ గని పెంచినవారికి, నితర బంధుమిత్రులకుఁ బరిచితులకు నతనిపై నసహ్యా మేర్పడెను.

అయినను రామమోహనునకుఁ దన తల్లియందుఁగల భక్తి యపారమైనది. హేతువాదము, శాస్త్రవిజ్ఞానములందుఁ గల యాదరమున కిది తీసిపోవునది కాదు. ఆమెను సంతృప్తి పఱుచుటకై గృహదేవతలకు మ్రొక్కుచుఁ బ్రార్థనలు చెల్లించుచుఁ గొంతకాలము గడపెను. అందువలనఁ దన దివ్యజననికి దృప్తి కలిగినను గలుగకున్నను భౌతికముగాఁ గనఁబడు జననిని సంతృప్తిపఱుచుట జరుగుచున్నదిగదా యని యతఁడు సరిపెట్టుకొనెను. ఈమె వలననే తనకీ శరీరము వచ్చినది. ఈమె పోషణముననే పెరిగి పెద్ద యైనాఁడు. తా నీమె కీవిధముగా ఋణపడియున్నాఁడు గదా! ఈ ఋణముఁ దాను దీర్పవలదా? విగ్రహమునెదుట మోకరిల్లునపుడు తాను గావించునది యవివేక మూలకమనియు, హాస్యాస్పదమనియు, దలఁచుకొని, తనలోఁ దానే నవ్వుకొనెడివాఁడు.

క్రమముగా నతని భావనాధోరణి, ప్రవర్తన, విప్లవాత్మకములుగా భాసించి గృహమున శాంతి కఱవయ్యెను. ఆ విప్లవధోరణికిఁ దగిన పరిహారము చెల్లింపవలసి వచ్చెను. ఇది విప్లవకారు లందఱికిఁ దప్పనిదేకదా! ఆ భావములు సర్వసామాన్యములైన భావములకు విరుద్ధములుగా నుండి, పురాతన సంఘ నియమములకు హానికరములయినచో నిఁకఁ జెప్పవలసినదే లేదు. బాల్య మింకను వదలిపెట్టకముందే యతఁ డిల్లు

వదలిపెట్టవలసిన యవసర మేర్పడెను. అటుపిమ్మటఁ దాను సత్య మని నమ్మిన దానినిఁ బ్రచారము చేయుచు ననేక వత్స రము లతఁడటు నిటు తిరిగెను. ఆ సంచారములో నతఁ డెంద అకో యాత్మజ్ఞాను లగువారినిఁ గలసికొని వారి యభిమానము సంపాదించెను. సుదీర్ఘము లైన తీవ్రచర్చలు గావించి తన జ్ఞానము పెంపొందించుకొనెను.

కొలఁది సంవత్సరములకుఁ బిమ్మట రామమోహనుని జనకుఁడు కుమారుఁ డింటికి దిరిగి వచ్చుట కనుమతించెను. కాని రామమోహనుఁడు నిరంతర గ్రంథపఠనముతోఁ గాశీ పట్టణమందే కాలము గడపఁగోరెను. సంస్కృతభాషయందు మంచి పాండిత్యము సంపాదించి హైందవ పురాణములను ధర్మ శాస్త్రాదులను స్వయముగాఁ జదువుట కతఁడెంతో కృషి చేసెను. సంస్కృతభాషయం దతనికి విశేషమైన యభిమానము కలిగెను. ఆ వ్యాకరణము, నా శబ్దజాలము నతనికి సుపరిచిత మయ్యెను. ఆంగ్లభాషతో నతని కెప్పటికో కాని పరిచయము కలుగలేదు.

అంతలో నతని తండ్రి మరణించెను. రామమోహనున కిప్పుడు విశేషమైన పిత్రార్జితముపై నధికార మేర్పడినది. కాని యది యంతతేలికగా నతనికి స్వాధీనము కాలేదు. తల్లియే యా విషయమున నడ్డువచ్చి న్యాయస్థానమునందుఁ జెప్పుకొ నెను. తల్లియే గాక సనాతన ధర్మసూత్రములకు విరుద్ధముగా వర్తించునతని కాయాస్తి ననుభవించుటకు యోగ్యత లే దని యభిప్రాయపడిన పలువురకును నాశాభంగమగునట్లు, న్యాయ స్థానము రామమోహనున కనుకూలముగఁ దీర్పు చెప్పినది.

రామమోహనుని సోదరుఁడు మరణించెను. రామమోహనుని వదిన నాఁటియాచారము ననుసరించి సహగమనము చేయవలసియుండెను. విగతభర్తృక యగు కాంతకు నాథుని చితిపై భస్మ మగుటకంటె నుత్తమ మరణము లే దని హిందువుల విశ్వాసము. ఈ యాచారము రామమోహనున కేమాత్రము సమ్మతము గాలేదు. పై పెచ్చు మిక్కిలి యసహ్యము కలిగెను.

పతిశవము ప్రక్కనే చితి నధిరోహించిన బాలవితంతువు వహ్నిజ్వాలల వేఁడిమి భరింపలేక లేచి విముక్తి కొఱకై యాక్రోశించెను. పురోహితులును శుద్ధశ్రోత్రియు లయిన బంధువులు వెదురుకఱ్ఱలతో నామెను వెనుకకుఁ బడఁద్రోచి యామె యేడ్పులు వినరాకుండునట్లు డోళ్లు మ్రోగింపించిరి; కొమ్ము లూదించిరి. ఈ క్రూరమైన యసహ్య దృశ్యము యువకుఁడైన రామమోహనుని హృదయములో 'నీ రాక్షసాచారముపై దండెత్తవలె' నను నుద్వేగము పుట్టించెను. దానిని సమూలముగా నశింపఁజేయుట కతఁడు బద్ధకంకణుఁ డయ్యెను. నిరంతరములగు ప్రయత్నములవలనను నప్పటి రాజప్రతినిధియగు విలియం బెంటింక్ ప్రభువుయొక్క సంపూర్ణ సహకారమువలనను క్రీ. శ. 1811 వ సంవత్సరములో సహగమనము శిక్షార్హమైన నేర మని శాసన మతఁడు చేయింపఁగలిగెను. మూఢవిశ్వాసము లెన్నిటినో నశింపఁజేసి హిందూసంఘమునకు నతఁడు చేసిన మహత్తరసేవలలో నిది యొకటి.

క్రీ. శ. 1830 వ సంవత్సరములో రామమోహనుఁడు లండనురేవులో నోడ దిగెను. అతఁడు వెళ్ళినచోట నెల్ల

హృదయపూర్వక స్వాగతము లభించెను. అతని ప్రసంగములు వినుటకు జనులు గుంపులు గూడిరి. భరతదేశమునుండి యితర దేశములకు వెడలిన మహనీయులగు భారతీయులలో రాజా రామమోహనరాయ లొకఁడను ప్రసిద్ధికలిగెను. అతఁడొక ప్రవక్తయను భావమును, బలువురకుఁ గల్గెను. హిందూదేశమునకు నింగ్లాండునకు స్నేహబంధము సుదృఢముచేయుటే లండనునగరముఁ జూడ నరిగిన యతని ముఖ్యోద్దేశము. అటువంటి మైత్రి యీ యుభయదేశములకుఁ జాల నవసరమనియు నుపయోగకర మనియు నతఁడు నమ్మెను.

జాతిభ్రష్టత గలుగకుండ నతనిఁ గనిపెట్టి యుండుట కిద్దరు హైందవభృత్యు లతనివెంట నింగ్లాండునకు వచ్చిరనుట గమనార్హమైన విషయము. ప్రాఁత కట్టుబాట్లు, విగ్రహారాధనము, వర్ణవిభేదము నను వీనిపై నతఁడు పలుసంవత్సరములుగాఁ బోరాడుచుండియే యిట్లుచేసెను. ఇంగ్లాండులోని శుద్ధసనాతన తత్త్వమునకు వ్యతిరిక్తముగా నుపన్యసించి కూడఁ గాలక్రమమున నాపక్షములోనివాఁడుగనే జీవింపఁ దొడఁగెను. అతనికి దానియందు విశ్వాసమే కలిగెనో! అది యతనికి సులభముగా జయించుటకు వీలుగాని దుష్ట సాంప్రదాయముగా మిగిలిపోయెనో! యథార్థ మేమనఁగా నతని ప్రచారమున కా విధమైన ప్రవర్తన యనుకూలమయి యుండవచ్చును. సనాతనాచారము లన్నింటిపై నతఁ డొకేసారి దండెత్తియున్నచో నతఁ డాశించిన సంస్కరణము సాగియుండెడిదికాదు. హిందువు లతనినిఁ దమవాఁడుగా భావించి యుండరు. అతని పలుకులు వా రాదరించెడివారును గారు.

రామమోహనరాయలలో సామాన్య మానవాతీతము లయిన యుత్తమ లక్షణము లెన్నో నెలఁకొని యుండెను. అతఁడు క్రైస్తవమత మవలంబిపకపోయినను, క్రైస్తవ మత సంస్థలు చేయు విద్యాభివృద్ధి ప్రయత్నముల కెంతయో సహ కారమొనర్చెను. డాక్టరు డఫ్ అను క్రైస్తవ ప్రచారకుఁడు స్థాపింపఁ బూనుకొన్న పాఠశాలలో విద్యార్థులను జేర్పించు టకు రామమోహనుఁ డిల్లిల్లుఁ దిరిగెను. బైబిలును బెంగాలీ లోని కనువదింపఁబూనిన ప్రచారకులకుఁ జాలఁ దోడ్పడెను. అయినను నతని యథార్థవాదిత్వము నిర్భయ విమర్శలవలన నా ప్రచారకులకు నతనికి వైమనస్య మేర్పడెను. కాని యా క్రైస్తవులలో నతని కొక ప్రాణస్నేహితుఁ డుండెను. అతఁడు శ్రీ ఆదము అను ప్రచారకుఁడు; తోడివారికంటె విశాల దృక్పథము గలవాఁడు.

సామ్రాజ్యవాదము నభిమానించు బిషప్ మిడిల్టనను నతఁడు రామమోహనుని కొకప్పు డిట్లుపదేశించెను. 'జీవించి యుండఁగా గౌరవింపఁ బడుటకును, మరణానంతరము ప్రసిద్ధి నొందుటకును మీరు క్రైస్తవమతము స్వీకరింపవలెను. అట్లు యిన మీయందుఁ బ్రభుత్వమునకును నభిమాన మేర్పడును.' ఈ యుపదేశము రామమోహనునికి విస్మయాస్పదమే కాక, హాస్యాస్పదము నయ్యెను. ఆ బిషప్పునెడలఁ బూర్వమున్న సద్భావము నాఁటితో నంతరించెను. మాసిన యంగీ విడిచి క్రొత్త యంగీ తాల్చినంత సులభముగా నెవఁడైన నిజమతము విసర్జించి యన్యమత మెట్లవలంబింపఁ గలఁడో యతఁ డూహింపలేకపోయెను. అందుచే నైహిక లాభముకొఱకైన

మతాంతర స్వీకరణముకంటె నీచకార్యము లేదనిపించి, యటు పిమ్మట నతఁడా బిషప్పుతో మాటలాడుటే మానివైచెను.

బైబిలు, కొరాను, హైందవాద్యన్యమత గ్రంథములు పఠించు నిమిత్తమై యతఁడు హీబ్రూ, అరబ్బీ మున్నగు నితర భాష లెన్నో నేర్చెను. అతని రచన లనేకము లున్నవి. అన్నింటిలోఁ జదువఁదగిన యతని రచన 'జీసను సిద్ధాంతములు—శాంతి సౌఖ్యములకు మార్గదర్శకము' అనునది. నానా మత సిద్ధాంతములం దతనికిఁ గల సుపరిచయ మెట్టిదో దాని వలన విశదమగును.

స్వదేశమునకుఁ దిరిగివచ్చు భాగ్యము రామమోహనునికి లేకపోయెను. ఇంగ్లండులో నతఁడు గతించెను. బ్రిస్టలు నగరములో సమాధి చేయఁబడెను. అసాధారణ పురుషుఁడై, యొక్క భారతదేశ పౌరుఁడుగానేకాక ప్రపంచపౌరుఁడుగాఁ బరిగణింపఁబడిన యా మహనీయుని సమాధివలకు మిత్రులు గౌరవసూచకముగాఁ జని తుదిప్రణామ మర్పించిరి.

———

# 6. ధ్రువశ్యామ సోదరులు

## ప్రథమ భాగము

వితంతువు మంగళ, భగవద్ధ్యానముననే తన జీవితము గడపెను. త్రిసంధ్యల యందును శ్యామప్రభువగు శ్రీకృష్ణ విగ్రహమునెదుటఁ గూర్చుండి స్వామి సౌందర్య మభివర్ణించు మధురగేయముల నాలపించెడిది. గానానుగుణమైన కలకంఠ మామెసొమ్ము. ఆ గానము కోకిల గానమే.

మురళీవినోదియై సుందరతరుశాఖపై నధివసించినట్లు నిర్మింపఁబడిన మోహనమూర్తి యైన యిలువేల్పు ముందల నామె తన్నుఁ దాను మఱచెడిది.

స్వామి భక్తుఁడు కాఁదగిన పుత్త్రినొకనిఁ బ్రసాదింపుమని మంగళ తనదైవమును బ్రార్థించియుండెను. శ్యామప్రభువు భక్తురాలి ప్రార్థన మన్నించినాఁడు. మంగళకుఁ గుమారుఁడు కలిగినాఁడు. కాని కొడుకై దేండ్ల వాఁడై యున్నప్పుడే మంగళ భర్త స్వర్గస్థుఁడైనాఁడు. ఇప్పుడీమె యీ కుమారునిఁ జూచుకొనియే జీవింపఁ గలిగినది కాని, లేనిచో నేమై యుండెడిదో!

ఈ యైదేండ్ల బాలుని ముఖమం దొక యపూర్వ దివ్య తేజము భాసించుచుండెను. ఆ కన్నులలోని మెఱపది యసాధారణము. ఆ చూపులం దేదో దివ్యస్వప్నముఁ గనుచున్న భంగిమ గోచరించును.

పల్లెనుండి వారివిఁ జూచిపోవచ్చిన బాలుని వృద్ధమాతులుఁడు సుందర విగ్రహుఁ డైన తన భాగినేయునిఁ జూచి

యెంతో మురిసి పిమ్మట సోదరినిఁ జూచి యిట్లనెను. 'వీని కై దేండ్లు వచ్చినవి. బడికిఁ బంపవలెను. భగవత్కృపచే వీఁడు వర్ధిల్లగలఁడు. అమ్మా! మనసులోనిమాట చెప్పుచున్నాను. శ్యామప్రభుని దివ్యమూర్తినుండియే నీ కిట్టి రత్న ముదయించి నది.'

మంగళ యా మాటలు వినఁగనే ధ్రువుని బడికిఁ బంపఁ దలఁచినది. ఆ పాఠశాల దగ్గఱలో లేదు. అది మఱియొక గ్రామములో నుండెను. ఆ గ్రామమున కొక యడవి దాఁటి పోవలెను.

అది చీమలు దూరని చిట్టడివి; కాకులు దూరని కాఱడవి. సూర్యకిరణములు గూడ నచ్చటకుఁ దిన్నఁగా బోలేవు. చెట్ల నల్లని నీడ లంతట విస్తరించియుండును. నీడలే కాక చెట్టులును నల్లనివి; మిక్కిలి పొడవైనవి. వాని చిగురుఁ గొమ్మలును జేవదేరి వంపుదిరిగి యుండును; ఆ వృక్షశాఖలు లోకుల కెవరికిఁ జెప్పరాని మహారహస్యమేదో మూటగట్టు కొన్న భూతములవలెఁ గానిపించును. ఎప్పుడో యొకసారి గాలి వీచినపుడవి యిట్టట్టు చలించును. అప్పుడా చిగురుఁ గొమ్మలు ముందువెనుకల కల్లోలాడుచు నందుఁ బ్రయాణము చేయు ప్రజలను బెదఱించు భూతహస్తములవలెఁ దోచును. చెట్టునుండి చెట్టున కెగురుచు రకరకాల పిట్టలు కిలకిలారావములు సేయుచుండును. అప్పుడప్పుడు చెట్లసందులనుండి సాగు గాలి యడవిలోని ఘాసాగ్రముల నల్లనఁ జలింపఁజేయు చుండుట చూడఁగా నావనసీమ హృదయము స్పందింపఁజేయు చింత గుసగుసలాడు చున్నట్లు స్ఫురించును.

ధ్రువుఁడు బడికిఁ బోవలెనన్న నీ పచ్చికమీఁదుగా నస్పష్టమగు కాలిబాటవెంట నొక పావుమైలుదూరము నడువ వలెను. బడికేఁగు టతని కొక సమస్య కాదు గాని యొంటరిగా నా మార్గమునఁ బోవుట కభ్యంతరముఁ జెప్పెను. పసివాండ్రను బట్టుకొని యే పాతాళములోనో యున్న స్వస్థలమునకుఁ దీసికొనిపోవుటకు వేచియున్న యొక మహాభూతమువలెఁ గనఁబడు నా మహారణ్యముఁ దలఁచుకొనినంతనే ధ్రువునకెక్కడలేని భయమును గలిగెను. ఆ దట్టమైన చల్లని నీడలు, పచ్చని యాకులలో నిండిన పొడవైన వృక్షములు, నెల్లెడలఁ దిరుగాడు శకుంతసంతతులు నతనికిఁ బ్రీతి గొల్పునవే. కాని తల్లివెంట నున్నప్పుడు మాత్రమే తన కా ప్రీతి. తల్లిచెంత నుండఁగా శిశువు తన కెంతో భద్రత యున్నట్లు భావించును; గాని, యామె చెంతలేనిచో నెంతైన భయపడును. ధ్రువుఁడు తన జననిని గాఢముగాఁ బ్రేమించెను. అట్టి వాత్సల్యమయి మఱియొకతె లోకమున లేదని యతని భావము.. వాస్తవమునఁ గూడ మంగళవంటి దయామయి మంగళయే.

ధ్రువుఁడు తల్లితో నిట్లనెను. 'అమ్మా! నీవు దిన దినము నింటికడనుండి బడి గుమ్మమువఱకు నాతో వచ్చుచుందువా? అట్లయిననే నేను పాఠశాలకుఁ బోదును.''

"ధ్రువా! నీవు గారాలకూచివి కారాదు. లోకములో దేనినిగుఱించియు నీవు భయపడకుండుట నేర్చుకొనవలయును."

"అయినచో నాకొక తోఁబుట్టువు నీయరాదఁటమ్మా? వన్నుఁ బ్రతిదినము బడికిఁ దీసికొనిపోవుమగదా!"

"లేకేమి? నీ కొక యన్న యున్నాఁడు."

"అలాగునసా? నేనెప్పుడును జూడలేదే! ఎక్కడ నున్నాఁడు?"

"అడవిలో నడచిపోవునప్పుడు నీవు పిలిచినచో నతఁడు మాఱుపలుకఁ గలఁడు."

తల్లి యసత్యమాడదని విశ్వసించిన ధ్రువుఁ డా మఱునాఁటినుండి యొంటరిగానే పాఠశాలకుఁ బోదలచెను. కాని చిత్ర మేమనఁగా నతని కప్పుడా యడవివలన భయములేదు. తన సోదరునిఁ గలసికొనఁ బోవుచుండెను గదా!

అతఁడు మఱునాఁడు సూర్యోదయమువేళకు మేలుకొని, స్నానము, ప్రాతఃకాలభోజనము ముగించి, తన చిట్టిచేతులతోఁ దల్లినిఁ గౌఁగిలించుకొని, యానందాతిశయమున ముద్దు వెట్టుకొని యిట్లు పలికెను. 'అమ్మా! నేనిప్పుడు బడికి వెళ్ళుచున్నాను. అంతేకాదు. అడవిలోని నా యన్నను గలిసికొనుటకుఁగూడ బోవుచున్నాను.'

పిమ్మట నతఁడు నిర్భయముగా వనమార్గముఁ బట్టెను. వనములో నడుఁగు వెట్టునపుడే యం దెవరైన నుందురేమో యని కలయంజూచెను. అన్న యేమూలనైనఁ దనకొఱకుఁ గనిపెట్టుకొని యుండెనేమో! ఏ పొదల సందునుండియో, యే మహాశిల మాటున నుండియో, యాకస్మికముగాఁ గనఁబడు నేమో! కాని పాప మా శిశువున కెవరును గనఁబడరైరి. ఒక్క గాలి మాత్ర మటు నిటు వీచుచుఁ జెట్టుల చిగురుఁ గొమ్మలఁ గదలించుచు వానిపై నొక మృదువైన గేయమేదో పలికించుచున్న ట్లుండెను.

ఆ నిర్జనారణ్యమున నపుడపుడే పొడముచున్న భయముతో, ధ్రువుఁడు 'అన్నా !' యని బిగ్గఱగాఁ బిలిచెను. ఎల్లప్పుడును సజీవము జాగరూకము నగు ప్రతిధ్వని యెందుండియో అన్నా!' యని యంతకంటె బిగ్గఱగాఁ బలికెను. అంత విస్పష్టముగా వినఁబడిన యా శబ్దమువలన ధ్రువుఁడు తన తల్లి చెప్పినమాట యథార్థమే యని విశ్వసించెను. తనకొక సోదరుఁ డున్నాఁడనికూడ గట్టిగా నమ్మెను.

కనుకఁ దనమాట లిట్లు కొనసాగించెను. 'అన్నా ! నాకు భయముగా నున్నది. నీవు వచ్చి నన్ను బడికిఁ దీసికొని వెళ్ళవా ? నీవు నాచేయి పట్టుకొనవలెను. ఇక్కడ నీకై ఎదురు చూచుచున్నాను. రా ! రా !'

ఇట్లు పలికి ధ్రువుఁ డొక మలుపులో నాఁగిపోయెను. అక్కడ బూదిరంగుగల యొక శిలమీఁదఁ జలించుచున్న తరుశాఖ నీడ యొక సుకుమార చిత్రమువలెఁ గాన్పించుచుండెను. కొన్ని క్షణములలో నా బాలుఁడు దూరమందుండి తన దగ్గఱకు వచ్చుచున్న యొక సుందరమూర్తినిఁ జూచెను. బంగారు రంగుగల పట్టుపుట్టము ధరించియున్న యతని శరీరచ్ఛాయ వేసఁగియందలి యచ్ఛమైన నీలిమబ్బువలెఁ గనిపించెను. అతఁడు ధ్రువుని సమీపించి యిట్లనెను. 'చిన్నితమ్ముఁడా ! ఇదిగో వచ్చితిని. ఈ యడవిలో నీ కెట్టి భయము లేదు. నేను ప్రతిదినమును ప్రాతఃకాలమున నిన్ను బడికిఁ దీసికొనిపోయి సాయంకాలమున నీ యడవి దాఁటింతును.' ఇట్లు చెప్పి యా శ్యామసోదరుఁడు ధ్రువునిచేయి పట్టుకొని జాగ్రత్తగా నరణ్యము దాఁటించెను. ధ్రువుఁడు పొంగి




'నేను ప్రతిదినము ప్రాతఃకాలమున నిన్ను బడికిఁ దీసుకొనిపోయి
సాయంకాలమున నీ యడవి దాఁటింతును.'

పోయెను. ఆ సంతోషపారవశ్యములో నొక్క మాటయైనఁ బలుకలేకపోయెను. ఆ యపూర్వ సోదరుని తోడ్పాటున సాయంకాలమున కింటికి మఱలివచ్చిన పిమ్మట వనములో జరిగిన కథ యంతయుఁ దల్లికి వినిపించెను. 'అమ్మా! నా సోదరుఁడు నిజముగాఁ జక్కనివాఁడు. అతని శరీరము నీలమైనది. నడుము చుట్టు నొక పచ్చని బట్ట చుట్టుకొన్నాఁడు. అది బంగారము వలె మెఱసినది. నాయం దతని కెంతో ప్రేమ. అతనిని మన యింటికేల రానియ్యవు? మనతోనే యేల యుండనీయవు? నీ వతనిని నింటినుండి తఱిమివై చితి వేమి? అతఁడు చేసిన తప్పేమమ్మా? తిరిగి యింటికి రమ్మని చెప్పవమ్మా! అతనిని విడిచి నే నుండలేను. నాతో నెల్లప్పుడు కలసి యుండవలెను. నాతో నాడుకొనవలెను. నాకు నా బడిపాఠములను బోధింపవలెను...."

తల్లి కేమి చెప్పవలెనో తెలియలేదు. పిల్లవాని వర్ణన మంతయు విస్పష్టముగా నున్నది. శ్యామప్రభువు రూపమే యది! అయినను శిశువుల భావనాబలము వారికి నచ్చిన రూపమును జక్కగాఁ జిత్రింపఁగలదు. దాని కసాధ్యమైనది లేదు. వారు భావించిన దంతయు నంత వాస్తవముగాఁ దోఁచును.

అటుపిమ్మట ధ్రువుఁడు ప్రతిదినము బడికి వెళ్ళుచుండెను. ఒక్కదిన మైనను మా నుట యతని కెంతో కష్టముగా నున్నది. అందులకు గారణము సోదరుఁడేగాని పాఠశాలకాదు. శ్యామలమూర్తి, కనకాంబరధారి, యగు నా యపూర్వ సోదరుఁడు బడికిఁ దీసికొనిపోవునప్పుడును నింటికి వెంటఁబెట్టుకొని

వచ్చునపుడును గాలక్షేపమునకై చెప్పుచుండు నద్భుతకథల వలన ధ్రువుని కోమలహృదయములో నా యద్భుత సోదరుని యం దొక గాఢమైన యనురాగ ముదయించెను.

## ద్వి తీ య భా గ ము

అది శ్యామప్రభువు జన్మదినము. జన్మాష్టమివేడుకలకై గ్రామములో నెంతో ప్రయత్నము జరుగుచుండెను. ప్రతియింటను బచ్చనితోరణములు గట్టఁ బడినవి. కన్నులవిందుగాఁ గృష్ణవిగ్రహములు పుష్పమాలికలతో నలంకరింపఁబడినవి. ఆబాలగోపాలము శ్రీకృష్ణస్తోత్రములు గానముచేయుచుండెను. ఆ దిన మంతయు సంతోషోత్సాహములతో నతిశయించెను.

ధ్రువుఁడు మాత్రమే విచారముగ నుండెను. ఆతఁడు తల్లి నిట్లు ప్రార్థించెను. 'ఈనాఁడు నీ వన్న నింటికి రమ్మని పిలువవలెను. ఎల్లవారి కిది యెంతో సంతోషదినము. నాకు మాత్ర మా సంతోషము లేదు. అన్న మనయొద్దకుఁ దిరిగి రానిచో నాకు సంతోష మన్నది యుండనే యుండదు.'

మంగళ యిట్లన్నది. "అట్లే నాయనా ! నీ శ్యామసోదరుఁడు మన కుటీరమునకు రాఁదలచినచో నాకంటె నెక్కువగా నానందించువా రుండరు."

"అయినచో మన మడవికిఁ గలసిపోయి యింటికి రమ్మని యతనిని బిలిచికొనివత్తము" అని తన యపూర్వసోదరుని గుఱించి యెంతో గర్వించుచు నేదోయొక వ్యాజముచే నతని నింటికిఁ బిలిచికొనిరాఁ గోరిన ధ్రువుఁ డొక సూచన చేసెను.

ధ్రువునిసోదరుని నాహ్వానించుటకై యిరుగుపొరుగువా రెందఱితోకూడ వనమునకుఁ బ్రయాణమైరి. కుసుమమాలికలు కేలఁబూని ధ్రువుఁడును, మంగళయు దారితీయఁగా, వారందఱు మధురగానముతో వనములోఁ బ్రవేశించిరి; గాని యందు వారి కెవరును గనఁబడలేదు. ధ్రువుని హృదయము తీవ్రముగా స్పందించెను. "కొంచె మాఁగుఁడు, నేనతనిని బిలుతును. వెంటనే యతఁడు వచ్చును" అని యతఁడు తోడివారికిఁ జెప్పెను. "అన్నా!" యని ధ్రువుఁడు బిగ్గఱగాఁ బిలిచెను. అదేశబ్దము దూరముగాఁ బ్రతిధ్వనించెను.

'అదిగో! అతఁడు వచ్చుచున్నాఁడు!" అని ప్రతిధ్వని వినవచ్చినవైపు చూపుచు ధ్రువుఁ డుత్సాహముతోఁ బలికెను. అందఱును ధ్రువసోదరు నాగమనము నిరీక్షించుచు నూర్పు బిగఁబట్టి నిలిచిరి. కాని, పాపము! ధ్రువునిమాట చెల్లుబడి కాలేదు. అచ్చటి కెవ్వరును రారైరి. ధ్రువుఁడు నిలువునఁ గ్రుంగిపోయెను.

అతని నోటివెంట మాట రాలేదు. ఒక మహాపరాభ వము కలిగినట్లు వాని లేతఁగుండె విలపించెను. ప్రత్యుదయ మటఁ గాన్పించు నాయపూర్వసోదరుని యునికి సత్యమే యని యెదుటివారి నెట్లు నమ్మించుట? అందఱును వాని నిట్లు పరిహ సించిరి. "ధ్రువా! నీవంటి తెలివితక్కువ పిల్లవాఁ డింకొకఁ డుండఁడు. నీపిలుపునకు వచ్చిన సమాధానమది వట్టిప్రతిధ్వని మాత్రమే. నీసోదరుఁ డనఁదగిన వాఁడెవ్వఁడును నిక్కడలేఁడు. ఈ వనములోఁ గనపడునది మూఁడుచాఱల యుడుతలు, ప్రశ్నార్థకములవంటి తోఁకలుగల కోఁతులు మాత్రమే.

మేఘశ్యాముఁడు, కనకాంబరుఁడునైన వాఁడెవ్వఁడును నిశ్చయముగా నిక్కడ లేఁడు."

ధ్రువుఁడు నిర్ఘాంతపడెను. ఏమాటయును స్ఫురింప లేదు. కన్నుల నీరు తిరిగెను. పౌరుషభంగ మైనదను రోషముచేఁ గపోలము లెఱ్ఱవడెను. అందఱు నిండ్లకు మరలిరి. వారిలో నొక వృద్ధకాంత మంగళతో నిట్లనెను. "మంగళా! వీని యూహలకు పీనిని వదలిపెట్టితివా, వెఱ్ఱివాఁడై పోఁగలఁడు! జాగ్రత్త!"

కాని, ధ్రువుఁ డందఱి పిల్లలవంటివాఁడు కాఁడని హృదయములోఁ దన కెవ్వరో చెప్పుచున్నట్లు మంగళ కొక గాఢ విశ్వాసముండెను. అతఁడు శ్యామప్రభు ప్రసాదము! నిశ్చయముగా దివ్యాంశజనితుఁడు! పాఠశాలకుఁ బోవుచు దిరిగి వచ్చుటలలో నతఁ డెవరినైనఁ జూచియుండును. కాని, వట్టి భావనకాదు. నమ్మిక యెంతపని చేయునో యెవ రెఱుఁగుదురు? అదియొక మహాశక్తి. పర్వతములను గదలింపఁ గలదు; అద్భుతము లెన్నో చేయఁగలదు. విశ్వాసమువలనఁ గాని కార్యము లోకములో లేదు. కాని యిందు గట్టివిశ్వాసము నాకున్నదని గుండెపైఁ జేయి వెట్టుకొని చెప్పగలవాఁడెవఁడు? మానవుని మనస్సు శంకలకుఁ బుట్టినిల్లు. శుష్క తర్కములకుఁ బట్టుఁగొమ్మ. నిజమైన విశ్వాసము చలించునది కాదు. ధ్రువుని విశ్వాస మంత గాఢమైనది.

ఆ జన్మాష్టమీ దినమున విచారవశుఁడైన యా బాలుఁ డింటిలోని శ్యామప్రభు విగ్రహమున కెదుట విషాద మూర్తియై

నిలఁబడి బాష్పములతో స్వామి నభిషేకించుచుండెను. అతని కంటికిని మనస్సునకును మఱియొక లక్ష్యము లేదు. శ్యామ ప్రభువే. ఆ గదిలో నీ యైదేండ్ల పిల్లవాఁడు తప్ప మఱియొకరు లేరు. అతని కెదురుగా యుగయుగాల నాఁటి యా మహాప్రభు మూర్తి మాత్రమే యున్నది. మెల్లఁగా నా మూర్తిలో నుచ్ఛ్వాస నిశ్వాసము లారంభమైనవి. సజీవ ప్రాణులందు వలెనే యా కన్నులలో నొక మెఱపు పొటమరించినది. ధ్రువుఁ డా మూర్తిని గుర్తించెను. ఎవఁ డతఁడు ? ఎవఁడు తన్ను నిత్యము వనవీథిలో ననుసరించి వచ్చునో యా శ్యామసోదరుఁడే! ఆ విగ్రహ మిట్లు సచేతనమై పీఠము డిగివచ్చి ధ్రువుని యెట్టయెదుట నిలిచెను.

"అన్నా ! నీ కొఱకు మేమడవికిఁ బోయితిమి. కాని నీ వక్కడ లేవు. నీవు నా పిలు పందుకొనకపోవుటచే నా కెంతో పరాభవమైనది. ప్రతివాఁడును నన్నుఁజూచి నవ్విన వాఁడే. నేను వెఱ్ఱివాఁడనై నఁ గావలయును; గానిచో ననత్యవాదినై యుండ వలయు ననుకొనిరి" అని సంతోష దుఃఖము లొక్కుమ్మడిగా గద్గదస్వరముతో ధ్రువుఁ డన్న మాటలకుఁ బ్రభువిట్లు పలికెను. "తమ్ముఁడా ! ధ్రువా ! వారికందఱికి నా దర్శనము కలుగక పోవుటలో నీ తప్పేమున్నది ? నే నసలెవ్వరికినిఁ గనఁబడను. నిర్మల హృదయు లయిన వారికి మాత్రమే కానఁబడుదును." స్వామి పలుకులకు ధ్రువుఁడు విస్మితుఁడై యిట్లడిగినాఁడు. "ఏమి ? మాయమ్మ హృదయము కూడ నిర్మలము గాదా ?" "తమ్ముఁడా ! నీవు పెద్దవాఁడవైన పిమ్మట గ్రహింపఁగలవు. ఇప్పటిలో నీ విది యొక్క టే జ్ఞప్తియం దుంచుకొనుము.

హృదయము నిర్మలమైనఁగాని నాదర్శనము కలుగదు. నైర్మల్య మనఁగా నన్ను గుఱించి స్తుతులు చేయుట, యుపహారము లర్పించుట యనునవి కావు. హృదయపూర్వస్వము నా కర్పించు టయే నైర్మల్య మనఁబడును. లోభము, దుఃఖము, క్రోధము, జుగుప్స యను నవగుణములు లేని హృదయమే నాకుఁ గావలసినది. అటువంటిది యరుదు. ధ్రువా! నీ మనస్సు నిర్మలము. నిర్మలజీవితము ప్రసాదింపఁగల నక్షత్రమున నీవు జన్మించితివి. నీకుఁ దెలియకుండఁగనే నీవు యోగి వైతివి. నిశ్చయముగా నీతల్లి నీకుఁ దగిన పేరు పెట్టినది."

కన్నతల్లికే కనఁబడ నొప్పని క్రౌర్యము తన యన్న కెట్లు కలిగెనో ధ్రువున కిప్పటికిని బోధపడలేదు.

తిరిగి స్వామి యిట్లనెను. "ఇన్నాళ్లూ వినింపఁ దగినంత విశ్రాంతి లోకమునకు లేదు. మనుష్యుఁడు నోరు గట్టుకొన్నఁ గాని నేను మాటాడను. వాఁడు మాటాడ మొదలు పెట్టినచో నేను మౌనము వహింతును. మానవులు చెడతెగకుండ మాటలాడు చుందురు. వారి పలుకులపై వారి కంత మక్కువ. నేను వివరింపఁ దలఁచుకొన్న యంశములపై మాటలాడుటకు నాకు వారవకాశమే యిచ్చియుండ లేదు. కాని, ధ్రువా! వెలుఁగు నకు, సంతృప్తికినై నరులు నా వంకకు మఱలు సమయము రాఁ గలదు. నిశ్చయముగా నాతో నవసర మున్నప్పుడు నేను దప్పక వత్తును. ఒకరి నొకరు ద్వేషించుకొను నీ మనుష్యులు రణము లాడి యాడి, యలసి సొలసి, రాగద్వేషములు విడిచి,

గతమునకు వగచి, సత్యముఁ దెలిసికొనఁ గోరునాఁడు నేను గనిపింతును. కాని యంతవఱకును........"

శ్యామ సోదరుని పలుకులు ధ్రువుఁడు గ్రహించినట్లు కనిపించెను. పూజాగృహములోని యీ సంభాషణ వెలుపలి వారికిఁ గుతూహలము పుట్టించెను. వారివెనుకఁ బదిమంది చేరిరి. ధ్రువుని మాటలు వినఁబడినవి; కాని స్వామిమాటలు వినఁబడలేదు. ఎందుచేతనా ? వారివీనులు ప్రభుకంఠ మా లించు భాగ్యము నోచుకొనలేదు.

అందఱును లోనికి వచ్చిరి. యథాపూర్వముగా విగ్రహమైన శ్యామప్రభువు నెదుట నిలిచియున్న ధ్రువుఁడు మాత్రమే వారికిఁ గాన్పించెను.

ఈ ధ్రువుఁడు తనలోఁదానే మాటాడుచు, నెవరితోనో సంభాషించు చున్నట్లు భావించు నున్మత్తబాలుఁడని, వారు భావింపవలసివచ్చెను.

మంగళమాత్ర మా విషయము వారికి దురవగాహమైన దని తెలిసికొనెను. దేశములోని పరమయోగులలో నొకఁడుగా నెన్నికకు రాఁదగిన బాలుఁడు తన కుమారుఁడు. 'వీఁడు శ్రీకృష్ణప్రభు ప్రసాద'మని యిరుగుపొరుగులతో ననుచుండెను. అయినను వారి కందలి పరమార్థము తెలియలేదు.

అనుదినము ధ్రువుఁడు పాఠశాలకుఁ బోవుచునే యుం డెను. అడవి త్రోవలో శ్యామసోదరుఁడు తమ్మునిఁ గలసి కొనని దినము లేదు. ఇప్పు డాబాలుని కాచెట్లను జూచిన భయమే లేదు. ఆ యరణ్య మసహ్యముగను దోఁచుటలేదు.

అది యతనికెంతో సుందరముగాఁ గనఁబడుచుండెను. ప్రకృతి యంతయు నొక నవీనాద్భుతత్వముతో, నవకాంతితో నిండి యున్నట్లు కనిపించెను.

అచంచల విశ్వాసమువలనఁ, బారశాలకు రాకపోక లందొక మార్గదర్శకునిఁ దోడుచేసికొన్న ధ్రువునివలెనే, మన జీవయాత్రలోఁ దోడునీడ కాఁగల రక్షకుని మనమును గనిపెట్టఁ గలుగుదుమా ? అట్లయిన నింకేమి !

———

# 7. సంగీతపక్షి

ఒక రమణీయ వనమందు సంగీతపక్షి యొకటి నివసించెను. ఆ విహంగ మందలి కుసుమసంతతితో ముచ్చటలాడుచు, మధురముగా వినూతన స్వరరీతు లాలపించుచు దిన మొక నిముసముగాఁ గడపెను. తోఁటలోని ప్రత్తిగుబురులపై దానికి మక్కువ యెక్కువ. చిన్న తెలిమబ్బులవంటి ప్రత్తి గుత్తులు వెలిగ్రక్కునా చిన్నిచిన్ని కాయలను జూడఁగనే పక్షి కెంతో సంతోషమైనది. అదివెంటనే యా తరువులను జూసి యిట్లు ముచ్చటించినది. "ఓ సుందరకుజములారా! నా గూటిలో శిశువులకు సెజ్జ మృదువుగా లేదు. ఈ ప్రత్తి కొంచెముగఁ దీసికో నీయరా?" ఆ వృక్షము లాదరముతో నిట్లన్నవి. "అందుల కభ్యంతర మేమి? నీకుఁ గావలసినంత కొని పొమ్ము." చంచువునఁ జిక్కునంత ప్రత్తిఁ దీసికొని పక్షి గూటిలోనికిఁ బోయి తన పిల్లలకుఁ జక్కగాఁ సెజ్జ యమర్చు కొన్నది.



పిమ్మట నొకనాఁ డది యొక గ్రామముమీఁదుగాఁ బోవుచు నొక కుటీరము కడ నాఁగినది. అందొక మనుష్యుఁడు ప్రత్తిగుత్తులనుండి గింజలను జీర్ణపత్త్రలేశములను వేరు చేయుచుండెను. విడిప్రత్తిని జిన్నిచిన్ని బంతులుగాఁ బెట్టుచుండెను. పక్షి కొక సంకల్పము కలిగినది. "ఇటువంటి బంతులు కొన్ని నా కుండునేని యెంత సంతోషముగా నుండును!"

తత్క్షణమే సంగీతపక్షి స్వస్థలమున కెగిరిపోయి, వెనుకటి



తరువులను డాసి, వాని యనుమతితో మరికొంత ప్రత్తి ముక్కునఁ గఱచి కొని తిరిగి ప్రత్తిదంతులు చుటువాని కుటీరముకడ నాఁగినది.

“అన్నా! నమస్కార” మని వినయముగా నతనిఁ బలుకరించినది.

“నీవా సంగీతపక్షి! నీ బిడ్డలకు సేమమేకదా! ఇట్లువచ్చితి వేమి? నీకు నావలనఁ గావలసిన పని యేమైన నున్నదా?”

“నీవాత్సల్యము వర్ణనాతీతము. అన్నా! ఇటుచూడుము. నాయొద్దఁ గొంచెము ప్రత్తియున్నది. ఇందలి గింజలను, నలుసులను వేరుచేసి బాగుచేసి పెట్టుదువా? కాని నీ శ్రమకు బ్రతిఫలముగా నిచ్చుటకు నా యొద్ద ధన మేమియును లేదు సుమా! అయినప్పటికి......”

“ధనముచేతను గొనరాని దొకటి నీలో నున్నది. నీవు బాగుగా గానము చేయుదువు. నీవంటి సంగీతపక్షులకు భగవంతుఁడు ప్రసాదించిన మనోహర గేయము లెన్నో నీవును నేర్చియుందువు. నే నీ ప్రత్తిని బాగుచేయునంతలో నీవేదైనఁ బాటఁ బాడుదువా?”

ఆమాటలకు ముదితయై విహంగమాతవికిఁ గార్యభార మించుకంతయు స్ఫురింపనట్లు మనోహరగేయ మొకటి

పాడెను. ప్రత్తిబంతులు సిద్ధమైనవి. 'పక్షీ! ఇవిగో! నీవు కోరి నవి. నేను నీకుఁ జెప్పఁదలఁచిన దే మనఁగా నీపాటవిలువముం దివి చెప్పఁదగినవి కావు. ఇట్టి తియ్యనిపాటల కెంత ధన మిచ్చినను నీయవచ్చును " అని ప్రశంసించి యా సజ్జనుఁడు సంగీతపక్షిని వీడుకొలిపెను.

అతఁడు సజ్జనుఁడేకానిచో నాప్రత్తినపహరించి రెండు కాళ్ళు రువ్వియుండెడివాఁడు. ఆ యల్పప్రాణి వానినేమి చేయఁ గలదు? అతఁడు పాపభీతి గలవాఁడు. ఒకయమాయిక ప్రాణిని మోసగించి దానిసొత్తు నపహరింత మను భావమే యతనికిఁ గలుగలేదు.

ఆ మఱునాఁటి యుదయమున మృదుశయ్యనుండి లేచి యొడల నంటిన దూది దులుపుకొను సంగీతపక్షికిఁ దూర్పున నుదయించుచున్న సూర్యబింబ మెంతో యందముగాఁ గనఁ బడినది. ఆనందముతో నది సంచారమునకు వెడలినది.

కొంతదూరము పోఁగా నొకగ్రామములో "బజ్, కట్, హ్వార్" అను ధ్వనులు వినిపించి యవి యెందుండి వచ్చు చున్నవో, తెలిసికొన వలెనను కుతూహలముతోఁ, బక్షి



యచట నాఁగి, యోరగా వంచినతలతో, నాసక్తితోఁ జలించు కన్నులతో, నిట్టట్టు చూచుచుండఁగా దానికొక వృద్ధుఁడు కాన్పించెను. వెండితీఁగలవంటి వాని తెల్లనిగడ్డము వాని నైర్మల్యముఁ బ్రకటించుచున్నట్లు గోచరించెను. ఒకరాటము ముందున్న

యతని చెంత బ్రత్తికుప్ప యొకటి క్రీడాపర్వతమువలెఁ గని పించుచుండెను.

సంగీతపక్షి వానిదగ్గఱకుఁ బోయి యిట్లనెను. "అన్నా! నమస్కారము."

"దేవుఁడు నీకు మేలుచేయుఁగాక! సంగీతపక్షీ! నాతోనేమైనఁ బనియున్నదా?" అని పలికిన యావృద్ధునికిఁ దనకోరిక యెట్లు వెల్లడింపవలెనో పక్షికిఁ దెలియలేదు. ఆ ముసలివాఁడు చాల నీరసించి యుండెను. అతని చేతులు సన్నని మట్టియూడలవలెఁ గనఁబడుచుండెను. కన్నులు నల్లని వేకాని కాంతిహీనములై యుండెను. వీఁపు వంగిపోయెను. ఆవంపు కార్యభారముచేఁ గాక ముదిమిచేతఁ గలిగినదే యని విహగము గ్రహించెను.

"అన్నా! నీకు శ్రమ గల్పించుటకు బుద్ధి పుట్టకున్నది. కాని నాదగ్గఱఁ గొన్ని ప్రత్తియుండ లున్నవి. వానిని నీ రాటముపై దారముగా రూపొందింపవలె నను తలంపు గల్గి నది. ఇదేమియు దుస్సంకల్పము కాదుగదా! ఆ కోరిక నీవు తీర్పఁగలవా? కాని, ముందే చెప్పుచున్నాను సుమా! నీకు నేనేమియు ధనమీయలేను. అయినను...." అని యాఁగిన పక్షినిఁ జూచి వృద్ధుఁ డిట్లనెను.

"ధనముకంటె గొప్పవస్తువే నీదగ్గఱ నున్నదిగదా! నీవు చక్కని పాటలు పాడుదువు. ఒక తియ్యని పాట కెంత విలువ యుండునో చెప్పఁగలవాఁ డున్నాఁడా? నీకు నేను దారము దీసి యిచ్చునంతలో నీకు వచ్చిన పాట లన్నిటిలో మేలైన దొకటి పాడుచుండుము. చాలును. మఱి త్వరగా నీ

గూటికిఁ బోయి యా ప్రత్తియుండలను దీసికొని రా !"

సంతోషముతో ఖగము తిరిగి గూటియొద్దకుఁ బోయి యొక్కొక్కటి యొక్కొక్కసారిగాఁ దిరిగి, యా బంతులను గొనివచ్చెను. రాటపుఁ జక్రము తిరుగునప్పటికి నవ్వాడి యుల్లాస కరమగు శ్రుతిగా నండజము గాన మారంభించెను. వేతొక సహకారముతో గానము సేయు టన్నది నాఁడే దానికి దొలి యనుభవ మైనది.

ఆ వృద్ధుడును నెంతో మంచివాఁడు. లేనిచో నా ప్రత్తిబంతులు లాగికొని, యొక దండముతో 'హూ' షని యా పిట్టను ద్రోలియుండును. అతఁడు దైవమునకు భయపడు స్వభావము గలవాఁడు. తన జీవితములో నెన్నఁడు నెవరికి నెట్టి యపకారముఁ జేసినవాఁడు కాఁడు. అదియునుగాక పిట్టల వంటి ప్రాణులపై నతనికి మితిలేని వాత్సల్యము. వానిని దన కన్నబిడ్డలవలె జూచెడివాఁడు. దారమును దీసికొని కృతజ్ఞ తతో నెలవడిగిన శకుంతముతో, సంతోషాతిశయమునకు వార్ధక ప్రభావమును దోడై వడకుఁచున్న కంఠముతో నతఁ డిట్లనెను. "నా మాటలు నీ కాశ్చర్యము గొలుపవచ్చును. కాని యతిశయోక్తి రవంతయు లేదు. నీ పాటచే నా కూలికిఁ బెక్కురెట్లు ప్రతిఫలము ముట్టినది, నీ గానము దివ్యము. అది పరమేశ్వరుఁడు మీ సంగీత పక్షుల కనుగ్రహించిన విశిష్ట వరము."

ఆ దారము ముక్కునఁ గూర్చి, పట్టి పిట్టగూటికిఁ మఱలినది. కాని చిన్నిముక్కుతో దారపుటుండఁ గఱచి పట్టుట దాని బ్రతుకున కొక యద్భుతకార్యమై పోయినది.

ఆయాసము హెచ్చినది. అప్పుడే కనఁబడిన యొక కుటీరపుఁ గప్పుపై విశ్రాంతిఁ గోరి వ్రాలినది.

"ఈ కుటీరమందు సందడియేలేదేమి? ఇక్కడ నెవరును గాఁపురము చేయుటలేదా?" యను జిజ్ఞాసయొకటి యారంభమైనది. అంతలో నా కప్పుపై నొకమూల నెండలో నాఱవైచిన నలుచదరమగు తివాచివలె నొక మెఱ్ఱనిపొడి కనవచ్చినది. దాని ప్రక్కనే చిన్ని చాపపై నొక స్త్రీ చేతితో సున్నితముగా ఖండింపఁబడినట్లుండి యాఱఁబెట్టఁబడిన మామిడికాయ చీలికలు కానవచ్చినవి. ఆముక్కలు రెండుమూఁడు దినములలో నితర వ్యంజనములలో గ్రుచ్చి యెత్తఁబడునని పక్షి గ్రహించెను. కనుకఁ గుటీరములో నెవరో యొక రుండక



తప్పదు. కప్పు చివఱకుఁ బోయి చూడఁగా నందొక సాలెవాఁడు కనిపించెను. అతఁడు దారమును మగ్గముపై బడుగు పేకలుగా నమర్చి నేఁత ప్రారంభించెను. ఎంత ప్రయత్నించినను ఖగము తన కుతూహలముఁ బట్టలేక రవంత సవ్వడి చేసెను. సాలెవాఁడు తల యెత్తి చూచెను.

ఆశ్చర్యముతో నతఁడు భార్యను బిలిచి 'ఓసి యింటిదానా! చూడవే! సంగీతపక్షి యొకటి దారపుటుండలు తెచ్చిన'దని యతఁడు బిగ్గఱగాఁ జెప్పెను. కాని వాని భార్య యామాటలు నమ్మలేదు. తన మగఁడెప్పుడును మేలుకొని కూడఁ గలలుగనుచు నేమోచెప్పు స్వభావము గలవాఁడు.

"స్వాగతము సంగీతపక్షీ! నీవేమో పనిమీఁదనే వచ్చి నట్లు కన్పించుచున్నావు!"

"అన్నా! నమస్కారము. ఈ దారమొక చక్కని బట్టగా నేసిపెట్టుమని నావంటి అల్పప్రాణి నిన్నడుగవచ్చుట గర్వముగా భావింపవుగదా! ......"

"ఎన్నటికట్లు భావింపను. నీవంటి చక్కని పిట్టకొక యుపకారము చేసిపెట్టుట నాకుఁ జాల సంతోషకరము. కాని నీకు వస్త్రముతో నేమిపని? పక్షుల శరీరము లందమైన యీఁక లచే నాచ్ఛాదింపఁబడి యుండఁగా వానికి వస్త్రము లావశ్యక ములు కావే!"

"నేనందులకు గారణము జెప్పి నిన్నొప్పింపఁ గలను."

"అదే యొక గేయముగాఁ జెప్పుము. ఆ పాట నాకు బనిలో నుత్సాహము గలిగించును. అదియుఁగాక నాశ్రమకు నీవు ప్రతిఫల మిచ్చినట్లును నుండగలదు." అని ప్రసంగము చాలించి సాలెవాఁడా దారము దీసికొని బట్టగా నేఁత కుపక్ర మించెను.

సంగీత పక్షి యిట్లుపాడినది.

"వేఱువేఱగు నీ ఋతు భేదములను
నొకఁడె యాచ్ఛాదనమ్మయి యుండె నాకు
విసివి వేసారి తుదకిట్లు వెల్లడింతు
నంబరముఁ దాల్ప మనసయ్యెనయ్య! నేఁడు."

సాలెవాఁడా పాటవిని నవ్వి యిట్లనెను. "నీకు సహజ మైన యాచ్ఛాదనముపై వినుగు పుట్టినదా! నీయిచ్ఛకు వ్యతి రేకముగా నేనేమియుఁ జెప్పఁ దలఁపలేదు; కాని, తేపో,

మాపో, మానవులవలె వస్త్రములు తాల్చుటవలన నెంతో నష్టమున్నదని నీవే తెలిసికొనఁ గలవు. వస్త్రాచ్ఛాదనముచే వెలుఁగు, గాలి శరీరమునకుఁ దగులవు. చైతన్య హేతువు లయిన సూర్యకిరణములకును దూరమగుదువు. నీ నిజప్రకృతి నీవు మఱచిపోదువు."

అతని మాటలను ఖగము విశ్వసింపలేకపోయెను. అది యొక క్రొత్త నాగరకత నవలంబింపఁ దలఁచెను. దానికిఁ గావలసిన దంతయు నందుండెను.

నేఁత ముగియఁగనే సాలెవాఁడింటి పొరుగున నున్న యద్దకపువాని యొద్దకుఁ బోయి యింద్రధనుస్సువలె సప్త వర్ణము లుచితరీతిని ముద్రింపించెను.

"సంగీతపక్షీ! ఇఁక నీ వది తీసికొని దర్జీ యొద్దకుఁ బొమ్ము. నీ సంకల్పమున కనుగుణముగాఁ దయారైన యా యాచ్ఛాదనము ధరించిన పిమ్మట నన్నుఁ దలఁచుకొనుము. నీ తీయనిపాటకు నేను కృతజ్ఞుడను. నా శ్రమ కెవరును నే నాఁడును నిచ్చియుండనంత ప్రతిఫలము నీ విచ్చితివి. ఏమందువా? గాన మీశ్వరప్రసాదము. దానికంటె వెలగలది లోకములో లేదు."

సంగీతపక్షి సంతోషపరవశమయ్యెను. ఆ సప్తవర్ణ కలితాంబరముఁ జూడఁగనే దాని కన్ను లానందముతో మెఱసిపోయెను. శరీరములో రక్తము పఱుగులువారెను. సాలెవాఁడుకూడ నెంత సజ్జనుఁడు! ఆ దార మూడఁబెఱికికొని "పో! పక్షి! పొమ్మనరాదా? కాని యతఁడును దైవభక్తి, పాపభీతి గలవాఁడు. అసిధారావ్రతముగాఁ దన సాధుత్వమును

రక్షించుకొను పుణ్యాత్ముఁడు.



ఆ యండజ మా యంబర మునుండి దర్జీయింటికిఁ బోయినది. దర్జీ తీఱికగా లేఁడు. ఒక సుదీర్ఘ వస్త్రపు ఖండముఁ బరీక్షించుచుఁ జేతియందు విచిత్ర గాథలలోని భూతమువంటి యొక పెద్ద కత్తెర పట్టి సముచితముగా ఖండింపఁ దొడఁగెను.

"అన్నా! దర్జీ! నేఁడు చాల సుదిన" మని ఖగము పలికిన మాట లతనికి వినఁబడనేలేదు. అతఁడు తన కృత్యమున నిమగ్నుఁడై యుండెను. అండజ మింకొక మారు 'సుదినమయ్యా!' యన్నది. కాని దర్జీ వినిపించుకొనలేదు. అతని దృష్టి యంతయుఁ జేతిలోనున్న పనియందే లగ్నమై యుండెను. తన్ను మూర్ఖుఁడని విద్యావిహీనుఁ డని దూర మాలోచింపక భావించిన యా పక్షి నతఁడు చూడనేలేదు. పక్షికిఁ గొంతసేపటికిఁ దన యూహ తప్పని తెలియవచ్చినది. ఆ దర్జీ చెవిటివాఁడు. ఆ చెవుడు సామాన్యపుఁ జెవుడు కాదు. అది పాషాణముకన్నను దుర్భేద్యము.

"నిశ్చయములు వేగిరముగా మార్చుకొను టెంత దోషము! ఈ దర్జీ చెవిటివాఁడు. నామాట వినిపించుకొన లేదని నే నితనినిఁ దప్పుఁదలఁచి యేమేమో యనుకొంటిని. నే నేదైన గాన మారంభించినచో నితఁడు నా యునికి గుర్తించునేమో!" యని విహంగ మిట్లు గేయ మాలపించెను.

"ఆఱువేఁబగు నీ ఋతుభేదములను
నొకఁటె యాచ్ఛాదనమ్ముగా నుండె నాకు
విసివి వేసారి నే నిట్లు వెల్లడింతు
నంబరముఁ దాల్ప మనసయ్యెనయ్య! నేఁడు."

"ఓహోహో! ఏమంటివి?" అని గొంతు సవరించుకొనుచు దర్జీ యిట్లనెను. "నాకుఁ జెవు డెక్కువ. ఇప్పుడు నీ వన్నదే తిరిఁగి పలికెదవా?"

సంగీతపక్షి యాగేయము దిరిగి యాలపించెను. దర్జీముఖమం దానందము వెల్లివిరిసెను. "సత్యము! పరమ సత్యము! సంగీత పక్షీ! నీకుఁ జక్కని దుస్తులు తయారు చేయుదును. ఆ వేషములో నున్న నిన్నుఁ బక్షులెంతో గౌరవింపఁ గలవు. ఉత్తమ గాయకుఁడవని నిన్నుఁ గీర్తింపఁగల" వన్న యతని ప్రశంస కానందించి పక్షి తనకడనున్న వస్త్ర మతని యెదుటఁ బడవైచినది. వెంటనే దర్జీ దానినందుకొని తన నైపుణ్య మంతయుఁ బ్రకాశిత మౌనట్లు చక్కని యంగీ తయారుచేసి యిచ్చెను.

"నీవు నాకేమియు బ్రతిఫల మీయ నక్కఱలేదు. నీ గాన మతి మధురము. దైవప్రసాదమైన దీనికంటె మూల్యవంత మైనది లేదు. ఈ యంగీ ధరించి నీవు సంతోషించుటే నా సంతోషము" అని దానినిఁ బ్రశంసించెను.

జీవితములో నంతకుముందెన్నఁ డంగీ ధరించి యెఱుఁగని దగుటచే, సంగీతపక్షి, దానినెట్లు తొడిగికొనవలెనో, తోఁచక తికమకపడెను. దాని యవస్థకుఁ బ్రక్క లెగురునట్లు నవ్వుచు, దర్జీ తోడ్పడఁగాఁ బక్షి కుతూహలము ఫలించినది. దర్జీ వెంటనే యద్దముఁ దెమ్మని భార్యను బిలిచెను. శక్రచా

పపు రంగుల యంగీ దాల్చిన యాపక్షి ప్రతిబింబ మూలముగ జూడు మని యామెను ప్రోత్సహించెను. ఆమె యిట్లనెను. "ఇంత చక్కని దృశ్యము నా జీవితములోఁ జూచియెఱుగను." "ఇఁక నీ ప్రతిబింబము నీవొకసారి జూచుకొను" మని యా చతురస్రాకారపు దర్పణమును దర్జీ పక్షి కిచ్చెను. ఆ దర్పణ మత్యద్భుతమైనది. ఎన్నేండ్ల క్రిందటనో యొక సంతలో దర్జీ దానినిఁ గొనియుండెను.

తొలిసారి సంగీతపక్షి తన ప్రతిబింబము దర్పణము నందుఁ జూచుకొన్నది. అది తన ప్రతిబింబమును బూర్వము మడుఁగులలోఁ, ప్రవాహములలోఁ జూచియుండెను. కాని యింత మృదువు, నిశ్చలము నగు దర్పణములోఁ జూచియెఱుఁగదు. ఆ మడుఁగులు, ప్రవాహములలోని నీరు నిశ్చలముగా నుండదు. ఏ వాయువుతోనో కదలఁబాఱుచుండును. ప్రతిబింబ మదృశ్యమైపోవును.

"బలే! ఇప్పుడు నే నచ్చమైన పెద్దమనుష్యునివలె నున్నాను. అని సంగీతపక్షి మురిసికొనెను. హాస్యప్రియ, పెద్దమనుష్యులపట్ల స్వతంత్రాభిప్రాయములు గలదియు, నగు దర్జీపత్ని పక్షి మాటల కిట్లనెను. "అచ్చమైన పెద్దమనుష్యుఁ డన్నావే! లోకములో నిజమైన పెద్దమనుష్యుఁ డొకఁడున్నాఁడా? నా కాశ్చర్యముగా నున్నది." ఇట్లని యామె విఱుగఁబడి నవ్వెను.

సంగీతపక్షి తన రంగులయంగీఁ దలంచుకొని యేమేమో తలపోసికొనుచు నా దంపతులను వీడ్కొని పోయెను. కాని తన గూటికిఁ బోలేదు. ఆ శక్రచాపపు రంగులయంగీ గాలికి

దటతట గొట్టుకొనుచుండఁగా నెందెందో విహరింపవలె నని పించెను. "నేను రాజోద్యాన వనములో విశ్రమింతును. అప్పుడు దోఁటమాలులు నాతో మాటలాడఁ దగరు. ఈ సప్తవర్ణ కలితాంబరము లోకములో నా కొక క్రొత్తస్థానము గల్పించి నది. బూదిరంగుల యీఁకలే దుస్తులైన నా జాతి పక్షులతోడను గలిసియుండఁ దగదు. కనుక రాజోద్యానముఁ జేరెదను." అని యెంచుకొని యట్లే యచ్చటికిఁ బోయెను. చక్కని నారింజ, పసుపు, నెఱుపు రంగుల పక్వఫలములతో నేలకు వంగిన కొమ్మలు గల యొక పండ్లచెట్టుపై వ్రాలెను. తన యంగికిఁ గల యేడురంగులతో నా ఫలములలోఁ గనఁబడు మూఁడు రంగులను బోల్చికొని తన యాధిక్యమున కుబ్బి తబ్బిబ్బై యొడలు మఱచెను. అది య ట్లాలోచనలో మునిఁగి యుండఁగా రాజదంపతు లటు వచ్చుట తటస్థించెను. కాని పక్షి వారి రాక గమనింపలేదు. తన రంగుల యందే యుండె దాని మనస్సు!



రాజు :—అదిగో! ఆ సంగీత పక్షినిఁ జూడు.

రాణి:—ఓహో! రంగముఁ బ్రవేశింపనున్న నటుని వలె నున్నది! సుందర సంగీతపక్షీ! సుందర సంగీతపక్షీ! నీవు చిరకాలము వర్ధిల్లుము.

సంగీతపక్షి రాణినిఁ జూచి యి ట్లనుకొనెను. "ఆమె యెంత చక్కనిది!" అంతలో రాజు కనిపించెను. అతఁడు క్రొత్త పేక ముక్కమీఁద జిత్రింపఁబడిన రాజుబొమ్మవలెనే యుండెను.

అందుచే నది యిట్లనెను. "ఓ రాజా! నీరాణి యంత సహజ సుందరిగా నున్నదే! నీ విస్పేటు రాజువలె నున్నావేమి? ఆ నల్లని మొద్దుగడ్డ మెంత యసహ్యము!"

రాణి దాని మాటలకుఁ గుసుపుట్ట నవ్వెను. రాజును నవ్వెను. కాని యది కృత్రిమ హాస్యము మాత్రమే. అది కోపమును గుప్తము గావించుటకుఁ జేయఁబడిన ప్రయత్నము. తన రాణియెదుటఁ దన్నా పక్షి యపహసించినది. దానికిఁ బ్రతీకారము చేయవలెను. అది నిశ్చయమే.

హఠాత్తుగాఁ దనకఠిన హస్తములతో నతఁ డా పక్షినిఁ బట్టుకొని యంగీ లాగివైచి "పొగురుబోతా! నే నిస్పేటు రాజనే యగుదునో; నిజమైన రాజనే యగుదునో; నీ కిప్పుడే తెలియఁ జేయుదు"నని యా యంగీ రాణిచెంతకు విసరుచు "దీనినిఁ దుడుపుగుడ్డగా నుపయోగింపు" మని పలికెను.

రాణి రాజును శాంతింపఁజేయ యత్నించెను. కాని యతఁడు కోపోద్రిక్తుఁడై యుండెను. అప్పటితో నే విధముగను నతఁడు శాంతింపఁడని యామె గ్రహించెను.

"నన్ను మన్నింపుము. నేను ని న్నపహసించినట్లు జరుగుటకుఁ జింతించుచున్నాను. నేను సత్యముఁ జెప్పెదను. నా కా యుద్దేశమేలేదు. మహారాజా! నా శక్రచాపపుటంగి నాకుఁ దిరిగి ప్రసాదింపు" మని సంగీతపక్షి రాజును ప్రార్థించెను. "రాజునింట మేజాబల్లపై నుండఁదగిన యీ రంగుల యంగీతో సంగీత పక్షి కేమి పని?" యని రాజు వికృతహాసము చేసెను. "ఇటు రా! నాచేతులతో నీ శరీరముఁ జక్కజేయనీ! నేను నీకు గౌరవమే చేయుదు" నని యీఁకలెల్లఁ బెకలించి

పాఱవైచుచుఁ దా నొక సాహసకార్యముఁ జేయుచున్నట్లు పొంగిపోయెను. కొలఁది నిముసములలో సంగీతపక్షి తనరంగుల యంగినేగాక, శారీరిక సహజాచ్ఛాదనముఁగూడఁ గోల్పోయి గుర్తింపరానట్లు మాఱిపోయెను. ఆ రాజు చేతిలో నది నిస్స హాయమయ్యెను. కాని యదృష్టవశముచేఁ దన సర్వస్వము గోల్పోయి ప్రాణావశిష్టముగా నున్నను, సహజగాన నైపుణ్యము మాత్రము నశింపలేదు. రాజు చేతిలోఁ గ్రూరహింసకు గుఱి యగుచు నిట్లు విషాదగీతిక యాలపించినది.

"ఇంత లింతలుగాఁ బత్త్రినెల్ల విదుచు
నాతఁడేనియు నింత క్రౌర్య మ్మెఱుఁగఁడు
తేని యంతటి స్వార్థమూర్తియును గాఁడు
మృత్యుముఖమున నా గేయ మిది వినుండు."

రాజీ పాట విని మఱింత మండిపడెను. ఒక పదునైన కత్తితో దాని యవయవములు దఱుగ నారంభించెను. సంగీత పక్షి యా విషాదగీతిక మఱల నందుకొనెను.

"నాదు నంగీ నిమిత్తమై నాఁ దతండు
వలువ ఖండించెఁ గాని యీ పరుసఁదనము
కత్తెఱకు లేదు; కాఁ డింతకఠినుఁ డతఁడు
మృత్యుముఖమున నాగేయ మిది వినుండు."

సంగీతపక్షి మాంసఖండములతోఁ బళ్ళెరము నిండెను. ఆ ఖండములు ప్రొయ్యిమీఁదికిఁ జేరెను.

సంగీతపక్షి యిట్లనుకొనెను. "ఇచ్చట బాగుగా వెచ్చఁ దనమున్నను నా గూటిలోవలె లేదు."

చక్కఁగా నుడికిన యా మాంసఖండములను రా జతి

ప్రీతితో నారగించుచుఁ నాశాపాతకుఁడు కనుకఁ దనరాణీ కా సరసాహారమున భాగము మిగుల్పఁ డయ్యెను. కాని యతఁ డామె కే కొంచెమైన మిగిల్చినను నా సంగీతపక్షినిఁ దలంచి విచారపడుచు రాజుక్రౌర్యము నసహ్యించుకొన్న రాణి యూహాంస మెట్లు భుజించును?

రాజు నుదరమునుండి సంగీతపక్షి పలుకులిట్లు వినవ చ్చెను. "ట్వీట్, ట్వీట్, ట్వీట్; ట్వీట్, ట్వీట్, ట్వీట్."

రా జిట్లు గర్జించెను. "నోరు మూయుము. చచ్చిపడి యుండుము."

కాని సంగీతపక్షికిఁ బుట్టుకతోనే గాన మబ్బినది. సహజగాయకు లెన్నఁడు మరణింపరు. రా జోదరస్థమయి యుండియు నిట్లు పాడఁగడఁగెను.

"ప్రజల నణఁగఁద్రొక్కునట్టి రా జతఁడు కిరాతుఁడు;
ఆ కిరాతకత్వము సత్యమ్ముగ భయమూలము;
బలహీనుల హింసపెట్టు వాఁడా బలవంతుఁడు?
తలచి నాదు గేయభావ మరయుఁడు మతిమంతులై."

రాజు కోపావిష్టుఁడగు కొలఁదిఁయు సంగీతపక్షి కంఠ మును విజృంభించెను. ఆ కోపవేగముచే రా జవశుఁడై పోయెను. దానిని శమింపఁ జేసికొనుట కే పరిష్కారమార్గమును గనఁబడ దయ్యెను.

ప్రధాని సామంతాదులతోఁ గొలువుదీర్చి యున్నవేళ విహంగ మింకను స్వరముఁ బెంచెను. సభాసదులంద ఱా పాట వినిరి. అంద ఱందలి భావము, జరిగిన వృత్తాంతము నూహించిరి.

కాని నోరువిప్పి యేమనుటకును నెవరికిని సాహసము లేకపో యెను.

రాజవైద్యునిఁ దక్షణమే పిలిపించుట మంచిదని ప్రధాని యొక సూచన చేసెను. ఆతురతతోఁ బర్విడివచ్చిన యా వైద్యుఁడు రాజునుదరమునుండి వినవచ్చు పాట విని తెల్ల వోయెను. వ్రేటువడ్డ సింగమువలె రాజిట్లు గర్జించెను. "ఓయి వైద్యుఁడా ! ఈ ప్రమాదకరపక్షి నీక్షణముననే తీసివే యుము." వైద్యుఁడిట్లు మనవిచేసికొనెను. "ప్రభూ ! ఇది యసాధారణమైనది. నా సుప్పదేండ్ల యనుభవములో నిట్టి వైచిత్ర్య మెఱుఁగను నే నెందఱికో శస్త్రచికిత్స చేసితిని; శిధి లితావయవములు చక్కఁజేసితిని; తీవ్రతర వ్రణములను నిర్మూలించితిని. నా నిశ్చితాభిప్రాయమిది. ప్రభువుల యుదర మందు గానముచేయు నీ సంగీతపక్షిని వెలువరించుట మాత్ర మపూర్వము. అసాధ్యము." రాజు మఱల నిట్లనెను. 'నా కేమియు వినఁబడదు. ఏ దేమైనను నాకు లక్ష్యములేదు. ఈ క్షుద్రపక్షినిఁ దక్షణమే తీసివేయవలెను. శూలవ్యాధి యైన భరింపవచ్చును; గాని యుదరమునుండి వచ్చు నీపాట మాత్రము దుర్భరము. నన్నీ పక్షిసంబంధమునుండి వేఱు చేయుము."

రాజవైద్యుఁడు సవినయముగా "దేవా! తమ వదన వివరము విశాలముగాఁ జూపుఁ"డని దక్షిణహస్తమున శస్త్రముఁ బూని, వివృతమైన రాజునోటిలోనికిఁ జూచెను. అరేబియన్ నైట్సు కథలలోని నలుబది దొంగల గుహవలె నారాజు నాస్యరంధ్రము కన్నుపొడుచుకొన్నను గానరాని తమస్సుచే

నిండియుండెను. 'ఇంకను విశాలము గావలె'నని వైద్యుఁడుద్వే గముతో హెచ్చరించెను. 'ఇంకను విశాలముగ....' భూపాలుఁడు నోరు మఱింత విశాలముగఁ దెఱచెను. కృకవాక్వండమువంటి వివరముగల గుహవలె నోరొక్కటియే కనవచ్చి తేని మొగమే కనఁబడకపోయెను.

వైద్యుఁడందు దొంగిచూచి, మెల్లఁగా నిట్లనెను. 'అన్నా! సంగీత శకుంతమా! నీకు సేమమగుఁగాక! నామాట మన్నించి యీవలకురమ్మ.' రాజు కడుపులో ఱెక్కల టపటపమను శబ్దముపుట్టెను. కొన్ని క్షణములలోనే సాకారము, సజీవము నగు సంగీతపక్షి వెలుపలికి వచ్చెను. తొట్టతొలుతగా రాజునెత్తిపైఁ గూర్చుండి యిట్లుగాన మారంభించెను.

"ప్రజల నణఁగఁద్రొక్కు రాజు వాఁడే కూరాత్ముఁడు;
ఆ క్రౌర్యమె భయమూలకమని యుద్ఘాటింతును;
సంగీతవిహంగ మెందుఁజనిన నిదేపలుకును
కూరుసణఁచు నదనిదే కూఁడెఁ బ్రజాభ్యుదయమై."

రాజవైద్యుని చేతిలోని శస్త్ర మాకస్మికముగఁ గ్రిందఁ బడెను. సభాసదులందఱిని మూకీభావ మావరించెను. వారి కేమనుటకునుఁ దోఁచదయ్యెను. "సంగీతపక్షి వాక్కు సత్యము. అది యొక మహాపవ్రిక్తవలె భాషించినది." యని యెల్ల రనుకొనిరి.

పాట ముగిసినంతనే సంగీతపక్షి యెగిరిపోయెను. అది తనలో నిట్లనుకొనెను. "ఇఁక నెప్పుడును నవీన నాగరకత



కృతవాక్యాండము వంటి వివరముగల గుహవలె నోరొక్కటియే కనవచ్చి తేని మొగమే కనఁబడక పోయెను.

కాఅకు నేను వ్యామోహ పడకుందునుగాక ! అదియే సర్వా
నర్థములకు మూలము. లోకములో నిజమైన పెద్దమనుష్యుఁడే
లేఁడన్న దర్జీభార్య పలుకు లసత్యములుగావు. ఏమైనను నీ
రాజు పెద్దమనుష్యునివలె నటించుటకు మహా ప్రయాస పడి
నాఁడు."

---

# 8. వాల్మీకి

పూర్వకాలమందొక మహర్షి యిరువురు శిష్యులతో నొక యాశ్రమమున వసించుచుండెను. ఆ ఛాత్రులలో నొకఁడు రత్నాకరుఁడు. అతఁ డసాధారణ ప్రతిభాశాలి. రెండవవాఁడు మందమతులలో నగ్రేసరుఁడు; కాని గురువునం దధిక భక్తి తాత్పర్యములు గలవాఁడు. గురువునకును నతని యందు వాత్సల్య మెక్కువ.

ఆ యాశ్రమ మతి మనోజ్ఞము. సమున్నత వృక్షషండములచే సమావృతమై యున్నతలక్ష్యముల కాకరముగా విరాజిల్లుచుండెను. ప్రాతఃకాలమందు భాస్కరుని సువర్ణకిరణము లా కుటీరపు టావరణమునకు బంగరుపూఁత పెట్టునట్లు ప్రసరించును. ఆ సూర్యోదయమునకుఁ బూర్వమేఁ ప్రాగ్దిక్కున నరుణరేఖలు తోఁచీతోఁచకమున్నె, విహంగబృందములు కిలకిలలాడుచు గూండ్లనుండి వెలువడి యొక తరుశాఖనుండి మఱియొక శాఖకు నిత్యనూతన ప్రభాతగేయములతో వీనులవిందు నేయును.

మానవులఁ దలంచి భయమెఱుఁగని లేళ్ళు, దుప్పులు సూర్యోదయాదిగా సంచార మారంభించును. ఆ ప్రశాంతతను నా నిర్మలానందమును భంగపఱచు వేటకాఁ డెవ్వఁడును నప్పటివఱకం దడుఁగిడి యెఱుఁగడు. శస్త్రప్రయోగముచే నావసుంధర రక్తరంజితమైన దినము లేనేలేదను టతిశయోక్తి కాదు.

ఆ మహర్షి ప్రత్యూదయ మానందముతోఁ దన ఛాత్రుల కా యా విద్య లుపదేశించుచుండును. అటుపిమ్మట విద్యార్థుల వేదాధ్యయన నినాదమున మనసు నిలిపి తన్మయుఁ డగుచుండును. రత్నాకరుని ప్రతిభ దినదినమునకుఁ గ్రొత్త వెలుఁగు లీనుచుండెను. రెండవవాఁ డెంత ప్రయత్నించినను సోదరవిద్యార్థియంతవాఁడు కాలేకపోవు టటుండఁగా, బుద్ధిలో మెల్ల యన్నతైనఁ జదువులందుఁ గృతార్థత నొందలేకుండెను. తన యనంతరము రత్నాకరుఁడే తనస్థాన మలంకరింపఁ గలఁడని మహర్షి తలపోసి, యతనినిఁ గన్నబిడ్డవలె జూచుచు, నతనితోనే యధికకాలము గడపుచుండెను.

ఆ మహర్షి యొక లేడినిఁ బెంచుచుండెను. అది యెంతో సుందరమైనది. అదియును మహర్షికి నిజసంతానసమమై వర్ధిల్లుచుండెను. అనుదిన మా తపస్వి వింతవింత రంగుల యడవిపూలతో దండలుగట్టి హరిణకంఠమున నలంకరించును. అప్పుడది క్రొత్తపెండ్లికూఁతురే. దాని నటు నిటు మేతకుఁ దీసికొని పోవుట రత్నాకరుని విధి.

యథాప్రకార మొకనాఁటి యుదయమున లేడిని వెంటఁ బెట్టుకొని రత్నాకరుఁడు వనములోఁ జక్కఁగాఁ బచ్చిక పట్టి యున్న యొక ప్రదేశమునకుఁ బోయెను. 'హరిణము మెడకుఁ గట్టఁబడిన త్రాటికొన చేతఁబట్టుకొని యందం దది మేయుచుండఁగా వేదమంత్ర పునశ్చరణ మొనర్చు చుండెను. కొంతసేపటికిఁ దనచేతిలోని త్రాడు జాఱిపోవుట గమనించి రత్నాకరుఁడు లేడికై చూచెను. అల్లంత దూరాన మెడ నిక్కించి, మెఱుఁగు లీను కన్నులతో నది యొక దూరప్రదేశమువైపు

చూచుచుండెను. రత్నాకరుఁడు తిరిగి త్రాడు చేతఁబట్టెను. ఆకస్మికముగా నుత్సాహితమై మృగము ముందునకుఁ జెంగున దుమికెను. రత్నాకరుఁని చేతిలోఁ ద్రాడుమాత్రమే మిగిలెను.



పోనే పోవుచున్నదని రత్నాకరుఁడు హరిణమును బట్టుకొన లేచెను. అంతలోనే యది యొక పొదమాటునకుఁ బోయెను. ఆతురుఁడై రత్నాకరుఁ డా దిక్కునకుఁ బఱుగిడెను. మృగ మతని కందక వేగము హెచ్చించెను. ఎంత పరువెత్తినను రత్నాకరుఁ డడుఁగడుఁగున దానికి దూరమయ్యెనే కాని కలసికొనలేకపోయెను. మరి కొంతతడవున కది కంటికే కని పింపక పోయెను.

రత్నాకరుని హృదయము సంచలించెను. మృగ మదృశ్యమయినది. వట్టి త్రాడు తన్ను వెక్కిరించుచున్నది. ఇట్లాశ్రమమునకుఁ దిరిగి పోవచ్చునా? గురు వేమనునో! దాని నాయన యెంతగనో ప్రేమించునుగదా!

ఇట్లు నిర్వేదవశుఁడై వెనుదిరిగి పోవుటకు మనసొప్పక లేడి యరిగిన జాడనే మహావేగముతోఁ బయనించెను. కొంత దూరమేగునప్పటి కతని కొక వింతదృశ్యము పొడగట్టెను. అల్లంత దూరమున హరిణము లసంఖ్యాకములుగాఁ గూడి

యుండెను. ఆ బృందమున కావలినుండి తీయని పాట యొకటి శ్రవణగోచరమయ్యెను. ముందునకుఁ బోఁగాఁ గుసుమమాలికా లంకృతమైన యాశ్రమమృగమును గాననయ్యెను. సంతుష్టుఁడై రత్నాకరుఁడు దానినిఁ బట్టుకొనన నుత్సహించెను. అది యతని కందక మరింత దూరమరిగెను. 'ఏమైనను సరే! మృగమును బట్టుకొన' వలె నని యటు వోయిన రత్నాకరున కట నొక నవలావణ్య ఖనియగు యువతి నేత్రపర్వము గావించెను. ఆ గాన మామెదే. ఆ గాత్ర మాధుర్యమునకు ముగ్ధుఁడై, యా సౌందర్యమునకు బద్ధుఁడై, ప్రణయ రసస్నిగ్ధుఁడై రత్నాకరుఁడు తన వచ్చిన పని మరచిపోయెను.

ఆమె దివ్యకాంతయో! మఱి యెవతెయో! మానవ కాంతల కట్టి సౌందర్యముండునా? రత్నాకరుఁడు తన కనులను దాను నమ్మలేకపోయెను. తా నేదో కల గనుచుంటి ననుకొనెను. కాని కొంత విచారణపై నది స్వప్నముకాదు; సత్యమే యని గ్రహించి మెల్లఁగా నా తరుణిచెంత కరిగి యిట్లు ప్రశ్నించెను.

"నీవు దివ్యకాంతవా? లేక, కేవల మానవకాంతవా?" ఆ ప్రశ్న కామె సుందరముగా మందహాసమొనర్చి యిట్లనెను. 'నేను సాధారణ మానవకాంతనే, నేను దివ్యకాంతనని యె ట్లనుకొంటివి?'

"నీ గాత్రమాధుర్యమును బట్టి."

"నే నేమి పాడుచున్నానో నాకే తెలియదు. నాకెవరును సంగీతము నేర్పలేదు. ఆ పక్షులవలెనే నేనును నుల్లాసమునకై



"నీవు దివ్య కాంతవా ? లేక, కేవల మానవ కాంతవా ?"

తోఁచినట్లు పాడుదునే కాని, యొక పద్ధతికిఁ గట్టువడి నా తల పగులఁ గొట్టుకొనను."

"నీగాన మింత మనోహర మగుటకుఁ గారణ మిదే కావచ్చును. కాని నీ కంఠములోని యే దివ్యశక్తి యీ మృగము లన్నింటిని నయస్కాంత మినుమునువలె నిటకు రప్పించినదో నే నడుగవచ్చునా?"

ఆమె సమాధానము చెప్పలేదు. మొగము ప్రక్కకు ద్రిప్పుకొన్నది. 'ఇఁక నేను బోవలె' నని లేచినది.

'నీ విటనుండి పోవుటకు ముందు నా యాశ్రమ మృగమును బట్టియిత్తువా? నిన్నువిడిచి యది రానట్లున్న' దని రత్నాకరుఁ డామె నర్థించెను. ఆ యువతి వెంటనే యా హరిణము నొద్దకుఁ బోయి దాని చెవిలో నిట్లు చెప్పినది. "సుందర మృగమా! నీ యజమానితో నాశ్రమమునకుఁ బొమ్ము." రత్నాకరున కామాటలలోఁగూడ సంగీతమే వినిపించెను. అంతేకాదు. ఆమెకు సర్వముఁ దెలియు ననుపించెను. నిజముగా నామె మానవకాంత కానేకాదు. ఆమె మానుషియేయైనచో నా మృగము లన్నింటి న ట్లాకర్షింపఁ గలదా? దివ్యదృష్టితో నెక్కడ నేమి జరుగుచున్నదియు నామె చూడఁగలదు. ఎదుటి వారి మనస్సులు చూఱగొనఁ గలదు!

ఏమ్మట రత్నాకరుడు కృతకృత్యుఁడై హరిణముతో నాశ్రమముఁ జేరెను. 'ఇంత యాలస్యమునకుఁ గారణ మే' మని ప్రశ్నించిన మహర్షికి జరిగిన వృత్తాంత మంతయుఁ బూస గ్రుచ్చినట్లు వివరించెను. తపస్వి కథ యంతయు విని

యాశ్చర్యపడెను. విజ్ఞానమంతయు సంతరించితి ననుకొన్న తనకంటెను నా యువతి మహావిద్యానిధివలెఁ దోఁచెను. అట్లు తోఁచుటతో నెన్నఁడు కలవఱపెఱుఁగని ముని హృదయమున నశాంతి కాలుమోపెను.

మరునాఁటి యుదయమునఁ దిరిగి రత్నాకరుఁ డా యువతినిఁ జూడఁబోయెను. అతనివెంట రెండవ మునికుమారుఁడు గూడ నరిగెను గాని, లేడితో నొకచోట నాఁగి రత్నాకరుని పోక గమనించుచుండెను. ఆ యువతి యథాపూర్వముగనే మధుర గాన మాలపించుచుండెను. శతాధికములయిన ఖగము లామెను బరివేష్టించియుండెను. నీలిఱెక్కలు, నెఱ్ఱని తోఁకలు, నారింజరంగు ముక్కులు గలిగి, సామాన్యములు మొదలుకొని మహాపక్షులవఱకుఁ బలురకములగు విహంగము లందుండెను. అది యొక మనోజ్ఞ దృశ్యము.

యువతి రత్నాకరునిఁ జూచి చిరునవ్వుతో 'మఱల వచ్చితివే ! యని పలుకరించెను.

"ఔను, నీ కలకంఠము చెవులఁ బడినప్పటినుండి నీకు శుశ్రూష చేయవలె నను కుతూహలము కలిగినది."

"అదెట్లు ? నీ కొక యాచార్యుఁ డున్నాఁడు. ఒక గురువును బరిత్యజించి మఱి యొక గురువు నాశ్రయించుట దోషము." ఇ ట్లనునప్పు డామె నేత్రము లొక వింతకాంతితోఁ బ్రకాశించెను. ఆమె తిరిగి యిట్లనెను. "మీ యాచార్యుఁడు సామాన్యుఁడు కాఁడు. నేఁటి మహావిద్వాంసు లందఱిలో నగ్రేసరుఁడు. అట్టివానిని విడిచి నీవు నన్నాశ్రయింపఁ గోరుట వింతగా నున్నది."

రత్నాకరుఁ డా మాటలు వినిపించుకొననే లేదు.

"మా యాచార్యుఁడు మహనీయుఁడే. కాదనను. ఆయన నా కెన్నో మహత్తర విషయములను బోధించెను. కాని యాయనయొద్ద నా నేర్చిన జ్ఞానమంతయు నాకాశమునుండి పక్షులను, వనమునుండి మృగములను గానముచే సమాకర్షించు నీ దివ్యశక్తిముందు నెందులకుఁ గొఱగాదు."

ఆ యువతి యా మాటలాలించి, కొంతతడవు వాఁగి, యతనివంక నిశ్చలముగాఁ జూచుచు మృదువుగా నిట్లడిగెను. "అట్లయినచో నీవు నీ యాచార్యుని విడనాడి నీ జీవితమంతయు నాతోఁ గడపఁగలవా ? నీ విందులకు సమ్మతించినచో నేను నీ శిష్యత్వ మంగీకరింతును." రత్నాకరుఁడు వెంటనే "అట్లే ! నేను నిన్నే యనుసరింతు" నని శపథము చేసెను. ఆ మఱు క్షణముననే విచిత్రముగా నచటి విహంగము లన్నియు వినువీథి కెగసిపోయినవి. యువతి రత్నాకరుని వెంటఁ బెట్టుకొని యచటికి మూఁడుమైళ్ళ దూరమందున్న తన నివాస స్థలమునకు వెడలిపోయినది. నడచుచుఁగూడ నతి మృదులముగా నామె ధ్వనింపఁజేయు నొక సుకుమార గానము రత్నాకరుని హృదయ విహంగమునకు వల యైనది. అతని కప్పు డామెయే సర్వస్వము.

రత్నాకరుని తోడివిద్యార్థి కేమిచేయుటకుఁ బాలు వోలేదు. ఆచార్యుని కేమి చెప్పవలెను ? ఆ యువతియొక్క యమానుష ప్రభావముచే నెంతటివారైనఁ గట్టువడుదు రనుట ప్రత్యక్షముగా దెలిసినదికదా ! ఆశ్రమముఁ జేరినంతనె "రత్నా

కరుఁ డెక్కడ ?" నని గురువు ప్రశ్నించెను. శిష్యుఁడు చింతిల్లు పడుచు నిట్లనెను. "స్వామీ! అదే నేను చెప్పఁజాలను. అతఁడు మృగమును నా కొప్పగించి యడవిలో నెటో పోయెను. ఆ పిమ్మట నేమి జరిగెనో నాకుఁ దెలియదు."

ఆచార్యుఁడు తీక్ష్ణముగా నతనిని విలోకించి "నీవేదో గుప్తమొనరుచు చున్నావు. ఔనా ? ఇప్పటికైన సత్యముఁ జెప్పుము." అని పలుకఁగా శిష్యుఁడు భయభ్రాంతుఁడై యా యువతి వెన్నంటి రత్నాకరుఁ డరుగుటవఱకైన కథ వివరించెను. రత్నాకరుని కృతఘ్నతఁ దలఁచి మహర్షి కంపించెను. ఒకప్పు డొక గురువు నాశ్రయించిన వాఁ డెన్నటికి నతనిఁ బరిత్యజింప రాదు. అది దేవతల కాగ్రహము తెప్పించును. రాక్షసులకు సంతోషహేతు వగును. తరువాత నెన్నిరోజులో కడచినవి; కాని రత్నాకరుఁడు తిరిగి రానేలేదు.

ఆ యువతిపేరు ప్రతిభ. ఒకనాఁడు ప్రతిభ రత్నాకరు నికిఁ దన కథ యిట్లు చెప్పినది. "నాతలిదండ్రులు చాలకాలము వఱకు సంతతి లేనందువలన శారదాదేవినిఁ బ్రార్థించిరి. ఆ దేవి ప్రసాదఫలితముగా నేను జన్మించితిని. కాని పుట్టినప్పుడు నే నేడ్వనేలేదఁట! నాతల్లిదండ్రులకుఁ గలిగిన యాందోళన మున కంతములేదఁట! ఇట్లు నాలుగైదు దినములు కడచిన మీఁదట మాతల్లి ప్రార్థన విన్న సరస్వతీదేవి న న్ననుగ్రహించి నదఁట! ఇట్లు నేలఁబడిన యైదవనాటికి 'కేరు' మని నే నేడ్వ మొదలు పెట్టితినఁట! మాతల్లి కప్పటికిగాని సంతోషము కలు గలేదు. పుట్టినపిల్ల వెంటనే యేడ్వకున్నచోఁ దల్లి కెంత భయము! నిజముగా బ్రతికియే యున్నను, నా శిశువు మృత

శిశువే యనుకొందరు." రత్నాకరుఁ డా ప్రసంగమున కడ్డువచ్చి యిట్లనెను. "అది చాల వింతగాలేదా! మానవుల పుట్టుకతో రోదన ముద్భవించు చున్నది. మానవులకుఁ దొట్టతొలుతటి వరమే దుఃఖము."

ప్రతిభ తన కథ యిట్లు కొనసాగించెను. "ఆ నామొట్ట మొదటి యేడ్పునకుఁ జెట్లయాకులు సంతసముతో వర్తించె నఁట! నదీజలములు గంతు లిడిన వఁట. సరస్వతీదేవి నాకొసం గిన వరప్రభావ మటువంటిది. నా కంఠస్వరమందలి మహిమ కదే కారణము. నేను నీ కా రహస్యము బోధింపఁగలను..."

రత్నాకరుని నేత్రము లానందబాష్పములతో నవ రుద్ధములయ్యెను. అతఁ డామెతో నిట్లనెను. 'నేను నిన్నుఁ బెండ్లాడి యెల్లకాలము నీతోనే వివసింతును.'

"అది తగదు. మీరు బ్రాహ్మణులు. నేనా శూద్ర కన్యను. మృగయయే నా వృత్తి."

"దానికేమి? ప్రేమకంటె ఘనమైనది యేమున్నది? నేను నిన్నుఁ బ్రేమించుచున్నాను. నీ కలకంఠము నంతకంటెను బ్రేమింతును. మన మానందముగఁ గాపురము చేయఁగల మని నా నమ్మిక. విల్లమ్ములు లేని విచిత్రపు వేఁటకత్తెవు. నీకు వానితోఁ బనియేలేదు. నీ తియ్యని మాటతోనే ప్రపంచమం దలి యేప్రాణియైనను నీకు హస్తగత మగును. నేను నిన్నుఁ బెండ్లాడక తప్పదు. ఏదీ! నన్నుఁ బరిణయమాడెద ననుము. అవనా?"

ప్రతిభ మఱియొకమారు రత్నాకరుని కతని యున్నత వంశమును స్ఫురణకుఁ దెచ్చి, నీచవర్ణమందలి తన్నతఁడు

వివాహమాడు టాతనికే పాపహేతు వని చెప్పెను. రత్నా కరుఁడు ప్రాఁజదువులనుండి యనేకోదాహరణములు చెప్పి దానివలనఁ బాపము సంభవింప దనెను. పాపమేమైనఁ గలిగి నను నది తనకేకాని యామెకుఁ జెంద దనియెను. ఆమెకుఁ గూడ నందు భాగ మేమైన నున్నచో నా భాగమును దానే యనుభవింపఁగల ననెను.

ప్రతిభ మఱి మాటాడలేకపోయెను. అతని సంకల్పము నకుఁ దన యంగీకారముఁ దెలియజేసెను. అది యేవిధముగా? ఒక మధుర మందహాసముతో మాత్రమే.

నూత్న దంపతులు ప్రతిభా రత్నాకరు లానందమయ జీవితము గడుపుచుండిరి. ఒకనాఁడు రత్నాకరుఁడు తన పూర్వపు గురువున్న యాశ్రమముఁ జూచి రావలయు నను కొనెను. ఇంతలోఁ ప్రతిభ యిట్లనెను. "సరస్వతీదేవి యాలయ సమీపమున సంత జరుగుచున్నది. కనుక నేఁడు మన మిద్దఱ మచ్చటికిఁ బోదము." అతఁ డామెను గాదనలేదు. కాని చిత్ర మేమనఁగా నతఁ డెవరి సందర్శన మపేక్షించెనో యా మహ ర్షియే మార్గమధ్యమున వారి కెదు రయ్యెను. రత్నాకరుఁ డతి వినయముతో గురువును బలుకరింపఁ బోయెను. కాని యా తపస్వి యతనివంకఁ దీక్ష్ణముగాఁ జూచి యిట్లనెను. "నీ విన్నా ళ్ళుగా నెందు డాగిఁయుంటివో యచ్చటికే పొమ్ము. నిన్ను నేను క్షమింపఁజాలను. నీవు నాకడఁ జదివిన దంతయు మఱ పువుగాక! నీ బ్రాహ్మణత్వము నశించుఁగాక!"

ఆ మౌనీంద్రుని మాట లాలించి ప్రతిభ యతనిని తెప్పవాల్పక చూచి యిట్లనెను. "స్వామీ! తమవంటి సర్వ

జ్ఞుల కిది తగినపని గాదు. ఒక యుత్తమపురుషునా మీరు శపించుట? ఈ పని మీరు చేసియుండరానిది. ఇది యెంత యవివేకపుఁ గార్యము? అయినను జేయఁగలిగిన దేమున్నది? ఇఁక నాశపథ మాలింపుడు. మీ రతనికిఁ జెప్పిన విద్య మఱచినంతమాత్రాన నతనికి వచ్చిన నష్టము లేదు. నే నతనికిఁ జెప్పఁ దలచిన యద్భుతవిద్య లెన్నో యున్నవి. సరస్వతీదేవికడ నా నేర్చిన దంతయు నతనికి బోధింతును. ఇప్పుడు నేను మిమ్ము శపించియుండును. ఇది మఱవకుడు. జ్ఞానము, మహిమ యనునవి దుర్వినియోగపఱుపరానివి."

పిమ్మట రత్నాకరుని వెంట నిడుకొని స్వగృహముఁ జేరుకొనెను. రత్నాకరుఁ డామెయొద్ద శీఘ్రకాలములోనే యనేకవిద్య లభ్యసించెను. కాని యంతటితోఁ దృప్తిపడలేదు. సౌందర్యలహరి ప్రతిభను రత్నాలంకారములతో నలంకరింపవలెను. అతఁ డొకనాఁ డామెతో నిట్లనెను. "సఖీ! నీవు సౌందర్యరాశివి. నిన్నమూల్యదుకూలములతో, మణిమండనములతో నలంకరించిన నింకను నెట్లుందువోగదా!" ఆమె నవ్వుచు నిట్లు జవా బిచ్చినది. నేను నిజముగ సౌందర్య రాశినే యైనచో నానాథుని కీ సంకల్పమేల కలుగును?"

గురుశాపతప్తుఁడు రత్నాకరుఁ డప్పటినుండియు నా శాపఫల మనుభవింపఁ దొడఁగినాఁడు కనుకనే పాపహేతువైన ధనకాంక్ష యతనిలో నుదయించినది. సహజ సాధుత్వము నశించినది. క్రౌర్య మావేశించినది. అతఁ డిప్పుడు మృగయుఁడు, బందిపోటు, దొంగ. ఒకనాఁ డా వనమునందు సార్థవాహ సమూహ మొకటి ప్రయాణము చేయుచుండెను.

రత్నాకరుఁ డా సంగతి గ్రహించి వారిపై దాడిచేసి వలసినంత ధనము, నితరములగు నమూల్య వస్తువులు సంపాదించెను. తిన్నఁగాఁ గుటీరమునకుఁ బోయి ప్రతిభ కా ధనముఁ జూపి యిట్లనెను. "దేవీ! నీవొక రాజకుమారివి. కాదు, కాదు. రాణివె. నేను రాజను. ఈ వనమంతటికి నే నధికారిని. నాకుఁ గప్పముఁ జెల్లింపకుండ నిందు నడవఁగలవాఁ డెవ్వఁడు?" ప్రతిభ విస్మయముతో "నీ ధనమెట్లు లభించిన" దని యడిగెను. రత్నాకరుఁ డింతేయనెను. "అది లక్ష్మీప్రసాదము, ఇఁక న న్నేమియుఁ బ్రశ్నింపకుము."

నాఁటినుండి యా యడవిలోఁ జను బాటసారు లందరిని గొల్లగొట్టి రత్నాకరుఁడు విశేషధన మార్జించెను. కాని యతఁ డావిధముగా సంచరించుట ప్రతిభకుఁ దెలియదు. వనమంతట రత్నాకరు ననుచరులు కాచియుండి పాంథుల ధనప్రాణములు హరించుచుండిరి. ఒకనాఁడు ముగ్గురు యతు లా యరణ్యమునకు వచ్చిరి. వారు రత్నాకరుని కంటనే పడుట సంభవించెను. దూరమునుండియే వారి నుద్దేశించి యతఁ డిట్లు గర్జించెను. "ఎవ రక్కడ? అడుఁగుఁ గదలింపఁకుఁడు."

"బాబూ! మేము సన్యాసులము. మా త్రోవను మమ్ముఁ బోనిమ్ము."

"ఈ యరణ్యమున కేలికనైన నాకుఁ గప్పముఁ జెల్లింపకుండఁ బోవుటా? అది యెన్నఁటికిని జరుగనీయను."

"మేము సన్యాసులమని చెప్పనే చెప్పితిమి గదా! నీకుఁ గప్పము గట్టుటకు మాకడ నేముండును? ఆత్మయొక్కటి తప్ప మాకొక దృశ్యమాన పదార్థము లేదు. ఆ యాత్మయును నీ

కన్నులకుఁ గనుపింపదు. అది యటుంచి ముందు మా ప్రశ్నకు జవాబు చెప్పుము. మమ్ముల నిట్లు పోనీయక నిరోధించుట నీకేమి ధర్మము ?''

'ధర్మమో, అధర్మమో నాకుఁ దెలియదు. నా కొక భార్యయున్నది. భార్యయేమి ? ఆమె నారాణి. నే నామెను బోషింపవలెను. రాణి యెంత వైభవముగా జీవింపవలెనో మీ రెఱుఁగరా ? అందులకే నే నీ మార్గ మవలంబించితిని.''

"దీనిని మేము బందిపోటందుము. ఈ యరణ్యముపై నీ కేమియు నధికారము లేదు. ఇది భగవంతునిది. ఇందుఁ దిరగాడుట కందఱికి నధికారమున్నది."

"ఇంకను నిట్లే వాదము చేసితిరా; మీ బుఱ్ఱలెగురఁగలవు. జాగ్రత్త !

"సరేకాని; యీ కార్యమందలి పాపమెవరిదో నీ భార్య నడిగితివా ! అడిగి రా. మే మిచ్చటినుండి వెళ్ళములే. నీవు వచ్చువఱ కిక్కడనే యుందుము."

"మిమ్ము నమ్మువాఁ డెవఁడు ?" అని రత్నాకరుఁడు తన చేతనున్న త్రాటితో వారిని సమీప వృక్షమునకుఁ గట్టివైచి, భార్యదగ్గఱకుఁ బోయి యతు లడుగుమని చెప్పిన విషయము నం దామె యభిప్రాయ మడిగెను.

"నీవేది చేసినను దానికి నీవే బాధ్యుఁడవు; నీ చర్యలతో నాకేమి సంబంధము ? వివాహకాలమున సమస్త పాపమునాదే !' యని శపథము చేసితివి కదా ! ఇప్పుడీ ప్రశ్న మేల పుట్టినది? నీవేదైనఁ బాపము చేసియున్నచో దాని ఫలము నీవే యనుభవింపవలెను. ఇది నీ కొక్కనికే కాదు; ఏ జీవికైన నింతే."

రత్నాకరుఁడీ పలుకులు విని యాలోచనాధీనుఁ డయ్యెను. తన చేయుచున్నపని తప్పని స్ఫురించి పశ్చాత్తాపము కలిగెను. వెంటనే పరివ్రాజకత్రయ మున్నచోటికిఁ బోయి "స్వామీ ! నా యకార్యము క్షమింపరానిది. మిమ్ముల నింతతడవు నిర్బంధించి యుంచితిని. నన్ను మన్నింపుఁడు. మీ రిఁక నిచ్చవచ్చినట్లు లరుగుఁడు. నాకుఁ బశ్చాత్తాపము కలిగినది. నేఁటినుండియు నీవనమునం దెవ్వరిని నేను బాధింపఁ బోను." అని వారిని బంధవిముక్తుల నొనరించి వీడ్కొల్పెను.

రత్నాకరునిలో నిప్పు డొక గొప్ప మార్పు కలిగెను. అతఁ డిఁక నే జీవికైన బాధ కలిగింపలే కుండెను. అతని లోని మృగయత మృగ్యమే యయినది. తాను వెనుక గావించిన క్రూరకృత్యముల కెంతో దుఃఖించెను. హృదయము నిర్మల మయ్యెను. అందు సుకుమారములు, నుదారములు నగు భావములు మాత్రమే యుదయించెను. ఆ లలితభావముల నితరులకు వెల్లడింపవలెనను నావేదనయును బుట్టెను, కాని యతని కక్షరజ్ఞానమే లేదు. శబ్దజాల పరిచయ మసలే పూజ్యము. గురుశాప మెంతపని చేసినది!

ఒకనాఁ డొక విచిత్రము జరిగెను. ఒక వృక్షశాఖపైఁ గ్రౌంచమిథున మధివసించి యుండెను. ఇంపగు ముచ్చటలతో నవి బాహ్యజగత్తును మఱచి, యానందసముద్రమునఁ దేలి యాడుచుండెను. హఠాత్తుగా నొక కిరాతుని శరము దాఁకి మగపక్షి విలవిలఁ దన్నుకొనుచు నెత్తు రొలుక నేలఁగూలెను. ఆ పరిదీనమూర్తి యగు పక్షికాంతను జూచినంతనే రత్నాకరుని హృదయము నీళ్ళకంటెను బలుచనై, సంచలించి

పోయెను. అతని కంఠము రుద్ధ మయ్యెను. అంతలో సరస్వతీ దేవి యతని కన్నులకుఁ బొడసూపి యిట్లనెను. 'వత్సా! కిరాత శరాహతమైన యీ విహంగమును చూడఁగనే యీ బాణము నీకే తగిలినట్లు తపించుచున్నావు. నీ జీవితములో నిదే శుభపరిణామము. ఇదే లోకమునకు నవోదయము. ఒరుల పీడ నిజపీడగా, నొరులసౌఖ్యమే స్వసౌఖ్యముగాఁ బారమార్థిక మైన సంకల్పము గల జీవనమే జీవనము. అట్టివాఁడే సుకృతి. ఇప్పుడు నేను నీ కొక వరముఁ బ్రసాదించుచున్నాను. నీ కమ రత్వము సంపాదింపఁగల యొక పుణ్యేతిహాసము నీముఖమునఁ గావ్యరూపము దాల్పఁగలదు. ఏ దృశ్యముఁ జూచి నీ చిత్తము జాలిచేఁ గళవళించినదో; యే యనాథయగు పక్షికాంత నీ కరుణకుఁ బాత్రమైనదో; యే కిరాతుని క్రౌర్యము నిన్ను సంక్షుభితునిఁ జేసినదో; యా నీ తొలుతటి యనుభవమే తొలి కవిత గావలయును...... నేఁటినుండి నీ వొక కవి వగు దువు."

వెంటనే రత్నాకరుని యధరము చలించెను. మకరం దమువలె మధురమైన శ్లోకము తత్క్షణమే జాలువాఱెను.

"మానిషాద! ప్రతిష్ఠాంత్వ మగమశ్శాశ్వతీ స్సమాః
యత్క్రౌంచ మిధునాదేక మవధీః కామమోహితః."

ఆ వృక్షశాఖమీఁది ప్రణయరసాస్వాదనోల్లసితమైన క్రౌంచ మిధునము, బోయవాని బాణమునఁ బక్షివల్లభుఁడు నేల గూలుట, విహగరమణి యాక్రోశము, రత్నాకరుని సంతా పము నందుఁ జిత్రితములు. సరస్వతి సంతృప్తియై యంతర్హిత యైనది.



మహాకవి వాల్మీకి

గృహమునకుఁ దిరిగివచ్చి రత్నాకరుఁడు తన యపూర్వానుభవము ప్రతిభకు వినిపించెను. ఆమె హర్షపులకిత యైనది. వెంటనే పతికి సాష్టాంగ నమస్కార మొనర్చి యిట్లన్నది. "మహాకవీ! నేఁడుగదా నేను ధన్యనైతిని. భారతీ ప్రసాద కలితుఁడ వగు నీ వింక యుగయుగాలకుఁ బ్రాతఃస్మరణీయుఁడ వగుదవు."

ప్రతిభ పలుకులు సత్యములైనవి. రత్నాకరుఁడు శ్రీ రఘురామ చరితము కావ్యముగా రచించెను. అదే మన రామాయణము. భారతీయ వాఙ్మయమున నద్వితీయమైన కావ్యము. నాఁటినుండి నేఁటివఱ కా కవి 'వాల్మీకి' నామమునఁ బ్రపంచ ప్రజలకు సంస్మరణీయుఁ డైనాఁడు.